# భామ

(కథల సంపుటి)

దిగుమర్తి రామారావు



త్రివేణీ పబ్లిషర్సు
మచిలీపట్టణము

# పరిచయం

ప్రతిభావంతులైన నా మిత్రులు శ్రీ దిగుమర్తి రామారావు గారి కథలసంపుటికి పరిచయవాక్యం వ్రాయడం నాకు ఎంతో ఆనందంగా ఉన్నది. దిగుమర్తివారివంశం బరంపురం ప్రాంతంలో ప్రసిద్ధి కెక్కినది. సాహిత్యసేవలో, కళాసృష్టిలో, రాజకీయ నాయకత్వంలో మన్నన లందిన దామెర్ల, వరహాగిరి కుటుంబాల వారు వీరికి అత్యంత సన్నిహితులు. శ్రీ రామారావుగారు ఎం. ఏ., ఎల్. ఎల్. బి. పట్టభద్రులై, లాహోరు విశ్వవిద్యాలయంలో పత్రికారచనయందు ప్రత్యేకశిక్షణ పొందినారు. న్యాయవాద వృత్తిని అవలంబించక, రాజకీయ ఆర్థిక సమస్యలను సమగ్రంగా పరిశీలించి ఉత్తమవ్యాసముల రచించుటయందే నిమగ్నులైనారు. ఆంగ్ల ఆంధ్రముల రెంటిలోనూ చక్కని శైలికీ విమర్శనా పాటవానికీ పేరెన్నికగన్న రచయితలలో వీరు ఉత్తమశ్రేణికి చెందిన వారు.

తెలుగు సాహిత్య విమర్శనలేకాక అప్పుడప్పుడు వీరు కథానికలను రచించి 'ప్రతిభ' వంటి పత్రికలలో ప్రచురించేవారు. నేటి ఆంధ్రజీవితంలోని మాధుర్యమూ, వైచిత్ర్యమూ వీరిని సమానంగా ఆకర్షించినవి. సమకాలిక మధ్యతరగతి కుటుంబాల స్థితిగతులను వీరు నిశితంగా అవగతంచేసుకుని అందమైన వ్యావహారికశైలిలో వర్ణించారు. వీరి మాండలిక ప్రయోగాలు సైతం అందమైనవే. ఈ సంపుటిలోని 'తగాదా', 'పాపం' శ్రీ మునిమాణిక్యం వారి 'కాంతం కథల' తో పోల్చతగినవి. వీనిలో కథాసంవిధానంకన్న, చిత్రమైన సన్నివేశాలే ప్రధానమైనవి. ఆంధ్రోత్కళ సరిహద్దుప్రాంతంలో పుట్టిపెరిగిన శ్రీ రామారావు

గారు 'కొళిభిగాంవ్ ధాన్యంమిల్లు' 'శ్రీ రాధికాచరణములు' అన్న కథలలో ఉత్కళసంప్రదాయాలనూ అనుభవాలనూ నిక్షేపించారు. శ్రీ రాధికాదేవి వంగీయులకూ ఉత్కళులకూ ఆరాధ్యదేవత. మధురభక్తి నిధానమైన శ్రీ రాధికాదేవి చరణములప్రశంసతో పాటు, కథానాయకుడు తనకు అకస్మాత్తుగా నిశీథిలో వర్షపు హోరులో సాక్షాత్కరించిన అభినవ ప్రేమమూర్తిపై అనురాగమునుకూడ వ్యక్తపఱచినాడు. 'కారణం' విద్యార్థిదశలోని చిలిపిచేష్టలనువర్ణిస్తూ సున్నితంగా స్వేచ్ఛాప్రేమవాదులను విమర్శించినట్లు ధ్వనిస్తున్నది. వంగీయుల ఆచార వ్యవహారములపట్ల అసాధారణమైన మోహమును పెంచుకొని, క్రమంగా మారి, చివరకు 'గడ్డు'ఆంధ్రుడుగా రూపొందిన రామేశంగారికథ('సమత్తమ్మగారు') వీరి లలితహాస్యరచనకు ఉదాహరణం.

'మేం ముగ్గురం' మిక్కిలి ప్రశంసాపాత్రం. శ్రీ రామారావుగారి రచనాకౌశలం ఈ కథలో ఉత్తమస్థాయి నందుకున్నది. ఆశలన్నీ అడుగంటిన భగ్నజీవికి "జీవితంలో ఆశా ఆసక్తీ ఉత్సాహమూ మళ్ళీ చిగిరించడమే" ఇందలి ఇతివృత్తం. దేశద్రిమ్మరియైన కథానాయకుడు తలవని తలంపుగా ఒకరాత్రి స్వగ్రామం చేరుకున్నాడు. కడచిన జీవితానికి ముగింపూ, నూత్న జీవితానికి ప్రారంభమూ ఆరాత్రే జరిగినవి. నాయకుని ఆవేదనా, స్మృతిపరంపరా, మానసికపరివర్తనా అద్భుతంగా వర్ణింపబడ్డవి. 'ఖామ' ఇంకొక భగ్నజీవి చరిత్ర. తనవృత్తియందు ఏహ్యభావం కలవేశ్య ఒక పేదవిద్యార్థి ఔదార్యంవల్లా, నిష్కలంకప్రేమవల్లా గృహిణిగామారి, ఆదర్శ దాంపత్యజీవితాన్ని అనుభవిస్తుంది. 'పతిత'ల జీవితాన్ని చిత్రించడం కత్తిమీది సామువంటిది. 'అతి

వాస్తవికత' నెపంతో జుగుప్సాకరములైన వర్ణనలకు తావీయక శ్రీ రామారావుగారు నాయకా నాయికల పరస్పర ప్రేమవిశ్వాసాలను రమ్యంగా చిత్రించారు. సంఘపు కట్టుబాటులను అధిగమించి మిక్కిలి విపరీత పరిస్థితిలోకూడ ధైర్యాన్ని విడనాడక, తన ధర్మాన్ని నిర్వర్తించిన నాయకుని సాహసమే 'భామ'లో ప్రధాన విషయం.

నేటి ఆంధ్రకథకులలో శ్రీ రామారావుగారొక విశిష్ట స్థానమును పొందగలరని నా నమ్మకం. వీరి సాహిత్యసేవను ఆంధ్రలోకం ఆదరపూర్వకంగా స్వీకరించుగాక!

కోలవెన్ను రామకోటీశ్వరరావు

# కథల గూర్చి



'భామ' కథ, 1933 — 34 ప్రాంతాన, 'జ్వాల' పత్రికలో మొదట వెలువడినది. 'కారణం?' 23-7-1944 ఆదివారం 'ఆంధ్రపత్రిక' లోనూ, 'కోళిథిగాఁవ్ ధాన్యంమిల్లు' 1942 — 43 'ప్రతిభ'లోనూ, 'పాపం!' ఫిబ్రవరి 1947 'వెలుగు' లోనూ వెలువడినవి.

'మేం ముగ్గురం' సుమారు పాతిక సంవత్సరాలక్రిందట, అప్పట్లో కొంతకాలంనుంచీ మా సన్నిహిత బంధువర్గములోని అయిదారు కుటుంబములవారము నడుపుతూవచ్చిన వ్రాత పత్రిక, 'ఉషఃకాలము' లో వెలువడినది. ఆ కథనే యిప్పుడు కొద్దిగా మార్చి సరిదిద్దడమైనది. 'తగాదా' కూడా 'ఉషఃకాలము' అక్టోబరు 1942 ప్రతిలో వెలువడినది.

'శ్రీ రాధికాచరణములు' అగస్టు, 1948 'ఆంధ్రశిల్పి'లో ప్రచురణమైనది. 1953 లో వ్రాసిన 'సముత్తమ్మగారు' మాత్రము ఇదివరకెందులోనూ ప్రచురింపబడలేదు. అక్కడక్కడ సవరణలు చేయడముతప్ప, కథలన్నీ చాలవరకు మొదట వ్రాసినట్లే ఉంచబడినవి.

'కోళిథిగాఁవ్ ధాన్యంమిల్లు', 'శ్రీ రాధికాచరణములు' పత్రికలలో ప్రచురింపబడకముందు, వాటిలో ఒక కథను ఒక ప్రఖ్యాత తెలుగు పత్రికకు ప్రచురణార్థము పంపియుంటిని. ఆ పత్రికా సంపాదకులు కథ తిప్పి పంపివేస్తూ, ఏ బెంగాలీ రచయిత

కథనుండి అనువదింపబడినదో తెలియజేయనందున ప్రచురింపజాల మని నాకు వ్రాసినారు. అనువాదమో కాదో తెలుసుకోకుండానే బెంగాలీకథ అనువాదమయి ఉంటుందని నిశ్చయించడమునకు కారణము బహుశా ఆంధ్రదేశములో గ్రంథచౌర్యము కొంత వరకు వ్యాప్తిలో ఉండడము కావచ్చును.

తరువాత ఆ కథలను 'ప్రతిభ'కూ 'ఆంధ్రశిల్పి' కీ పంపి నప్పుడు అవి అనువాదములుకాని అనుసరణలుకాని కావనీ, స్వంత రచనలనీ, నేను ఒరిస్సాలో చిల్కా ప్రాంతానికి సమీపాన్నుండే ద్విభాషాప్రాంతవాసి నాటచే, చిల్కా తీరప్రాంతపు వాతావరణాన్ని స్ఫురింపచేయటానికి ఈ ప్రాంతపు పేర్లు వాడినాననీ వ్రాయవలసి వచ్చింది.

చదువరు లెవరేనా యిందలి కథ లేవేనా అనువాదములని అనుమానపడతారేమోనని పై సంగతి తెలియజేయడమైనది.

తెలుగులో పుస్తకరూపంలో వెలువరించే నా తొలియత్నం లోని ఈ కథల పుస్తకానికి, కోరినవెంటనే పరిచయవాక్యాలు వ్రాయడానికి అత్యంత దయతో అంగీకరించిన హితైషి, ప్రియ మిత్రులు శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావు గారికి బహు కృతజ్ఞుడను.

బరంపురం
10-10-55

—రచయిత

# విషయసూచిక


1. భామ 1
2. కారణం? 21
3. కొళిధిగాంవ్ ధాన్యంమిల్లు 27
4. పాపం! 41
5. మేం ముగ్గురం 52
6. తగాదా 83
7. శ్రీ రాధికాచరణములు 90
8. సమత్తమ్మగారు 112


★

## భామ

నేను గొప్పవాణ్ణి కాను. ఇంగ్లీషు చదువు చదివితే ఏదైనా పెద్ద ఉద్యోగమవుతుందని మా అమ్మ ఎంతో కష్టంతో నన్ను చదివిస్తూండేది. నాకు అమ్మ తప్ప యింకెవ్వరూ లేరు. ఏలాగో కష్టపడి 'స్కాలర్ షిప్' సహాయంవల్ల ఇంటరుమీడియెట్ పేసై బి. ఏ. కి ఆ ఊరు వెళ్ళాను. కాలేజీకి సమీపంలోనే ఓ సందులో అద్దె కొంచెం తక్కువగా వుండేటట్టు చూసి, చిన్నగది అద్దెకు తీసుకున్నా. నేనుండేగది మిగిలిన యింటితో అట్టే సంబంధం లేకుండా సదుపాయంగానే కట్టబడ్డది. కాని సందు మహాయిరుగ్గానూ, అసహ్యాంగానూ వుండేది. ఆ సందులో ముఖ్యంగా ఆయింట్లో వున్నానని చెప్పడానికి చాలా సిగ్గువేసేది. అయితే, ఆసందు అటువంటిదని మొదట నే నెరుగను. ఆ సందులో నేకాకుండా, నేనున్న యింటి వెనుక భాగాన్నికూడా భోగంవాళ్ళున్నారని తెలిశాకకూడా నేనా సందు విడిచి పెట్టలేదు. ఆ సందంటే నాకోవిధమైన ప్రీతీ, అభిమానమూ కలిగింది. ఆ సందులోని వారందరితోపాటూ నాకూ ఆ సందు దరిద్రమంతా అనుభవించాలెనని వింత బుద్ధి పుట్టింది. భోగంవాళ్ళమధ్య నివసిస్తే వాళ్ళ సాధక బాధకాలు బాగా తెలుస్తాయనికూడా, చిన్నతనపు ఉత్సాహంలో అనుకున్నాను.

రాత్రికూడా సరిపడ్డట్టు పొద్దున్నే వండుకునే వాణ్ణి. మధ్యాహ్నంమట్టుకు ఎక్కడేనా ఓ కప్పు కాఫీవో, టీవో తాగేవాణ్ణి. అంటే, బట్టల్లోనూ, టాయిలెట్టుల్లోనూ, సినిమాలకి పోవడంలోనూ, మిగిలిన సరదాలన్నిట్లోనూ చాలా క్లిష్టంగా ఉండేవాణ్ణని వేరే చెప్పనక్కరలేదు.

నాగది అంతస్థుమీదది. అక్కడ ఎలెక్ట్రిక్ దీపాలు వులే. సాయంకాలం బడినుండిరాగానే మొహం కడుక్కొని చొక్కా పంచె తీసి, చిన్న లాగూ బనియను వేసుకొని రోడ్డువేపు చూస్తూ నా పడక కుర్చీలో కూర్చునేవాడిని. భోగంవాళ్లందరూ రకరకాలుగా శృంగారించుకుని, మేడ వసారాలమీదికీ క్రింది వసారాలమీదికీ వచ్చి, వాళ్ళ సొబగులన్నీ చూపిస్తూండేవారు. వాళ్ళ నవ్వులతోటీ, వచ్చిపొయ్యే వాళ్ళ కేరింతాలతోనూ, సరస సల్లాపాలతోనూ, వీధెప్పుడూ కలకల్లాడుతూండేది. సందుమలుపులో ఒక సారాయిదుకాణం వుండేదికూడా. ఇంచుమించు ఆ సందులోని భోగంవాళ్ళంతా సారాయి తాగేవారు; సిగరెట్లు కాల్చేవారు.

నేనొక సామాన్యమైన విద్యార్థినని తెలిసినా, అప్పుడప్పుడు ఒక్కొక్క సానిఅమ్మాయి నన్ను చూసి కూడా నవ్వేది. అప్పుడేమి చెయ్యాలో బోధపడేదికాదు. కంగారుపడి, గట్టిగా కళ్ళు మూసుకుని నాలోనేనే

'ఊహూ' అనుకునేవాణ్ణి. అప్పుడు నాహృదయం జాలితోనో, ప్రేమతోనో, ఏదో ఆవేదనతో నిండిపోయి భారంగా అయిపోయేది.

భోగంవాళ్ళు, వేషంవేసుకున్న పై డాబు లేకాని ఏమీ బాగుండరని అంటారు. కాని, వారిలోనూ చాలమంది అందమైనవాళ్ళుంటారు. వాళ్ళని పాపం ప్రతీవారూ, రహస్యంగా కోరుతున్నా, పైకితిట్టేవారే. విద్యార్థులుకూడా వాళ్ళనుగురించి అమర్యాదగానూ, అసహ్యంగానూ మాట్లాడతారు. కాని వాళ్ళజీవితాలెందుకల్లా మారాయో, ఎట్లాగడుస్తున్నాయో, వాళ్ళ కష్టసుఖాలెట్లా వుంటాయో, తెలుసుకుందాం అని కుతూహలం చూపరు; సామాన్యమైన సానుభూతి, సోదరమానవభావమేనా చూపరు.

నేనుండే గది క్రిందిఅంతస్థులో, వెనుకభాగాన్ని, యిద్దరు భోగంవాళ్ళుండేవారు. పెద్దామెకు సుమారు నలభైసంవత్సరాలూ, చిన్నామెకు దాదాపు యిరవై వయస్సు ఉంటుంది. తల్లి, పిల్ల అనుకుంటాను. అమ్మాయిపేరు భామాసుందరి కాబోలు; 'భామా' అని పెద్దామె కేకవేస్తే, 'అమ్మా' అని పలికేది. వాళ్లు శృంగారించుకుని, ఒయ్యారంగా డాబామీద తిరుగుతూంటే నేను తరుచుగా వాళ్ళకేసి చూసేవాణ్ణి.

వృత్తిచేతా, అలవాటుచేతా భోగంవాళ్ళకి స్త్రీలకుండే సహజమైనలజ్జ, మొహమాటం చాలవరకూ

తగ్గిపోతాయి. కాని భామ మట్టుకు నన్ను చూసి కొంచెం సిగ్గుపడేది. ఆమెకళ్లు మహాఅందమైనవి; ఎంత సేపైనా చూడాలనేవుండేది. కాని, నే నామెవేపు చూస్తున్నానని తెలుస్తేమట్టుకు ఆమె తప్పకుండా తల వంచుకునేది. అది అమాయకమో, చమత్కారమో నాకు తెలియదు.

రాత్రులు తాగుబోతులూ, సరసులూ, ఒక్కొక్కప్పుడు విద్యార్థులుకూడా — రావడం, వెళ్ళడం, తలుపులుతియ్యడం వెయ్యడం, సందడిగానూ, ఒక్కొక్కప్పుడు అల్లరిగానూ, ఉండేది. ఏపక్కనో ఓపక్కని సంగీతంపెట్టి, గాత్రం, మద్దెలతోసహా, వాగుతూనే ఉండేది. సందు దుర్వాసనతో అగరువత్తులధూపమూ, పన్నీరు, పేరీస్ లేవెండర్ వగైరా సుగంధపరిమళం కూడా మేళవిస్తూండేది. ఈ వాతావరణానికి, గోలంతటికీ నేను అలవాటుపడిపోయాను.

ఓరోజురాత్రి నాకు బాగా నిద్రపట్టక, ఏదో ఆలోచిస్తూ పడుకున్నాను. ఇంతలో తలుపు చప్పుడైతే ఏలాటివాడోచూద్దామని చప్పుడుకాకుండా నారహస్య స్థలం చేరుకున్నాను. రహస్యస్థలం అంటే మరేం లేదు; నేనుండేఅంతస్థునుండి రెండుమెట్లు దిగితే గోడమీద చిన్న భాగం, వెల్తురుకిటికీకోసమో, మరి దేనికోసమో వదలివేయబడ్డది. అక్కణ్ణించి చూస్తే భామ, భామ తల్లివుండే రెండుగదులూ నాకు బాగా కనిపిస్తాయి. నాకు

తోచనప్పుడు మెట్లమీదదీపం ఆర్పేసి, ఎవరికీ కనిపించ కుండా ఆసలంనుంచి వాళ్ళగదుల్లోకి చూస్తూండేవాణ్ణి. అంత మంచిపని కాదు గాని, నేనప్పుడు చదువుకుండే కుఱ్ఱవాణ్ణి; లాలిత్యమన్నట్టె ఎరగని కుతూహలమూ, చిన్న తనపుచాపల్యమూ అప్పట్లో బొత్తిగా నాకులేకపో లేదు. ఆరోజు జరిగింది చెపితే నేను తరుచూ, అక్క ణ్ణించి ఏమి చూసేవాడినో తెలుస్తుంది. భామతల్లి కొత్తగావచ్చిన మనిషితో రెండవగదిలో మాట్లాడు తున్నది. అతడు, శుభ్రంగాతయారై బాగానేఉన్న ప్పటికీ, కొంచెం జబ్బుమనిషిలా వున్నాడు. నాదగ్గిర గదిలో భామ పడుకున్నది. నిద్రపోతూందికాబోలు! ఇంతలోకే వాళ్ళమ్మవచ్చి భామనుతట్టి ఏమో చెప్పింది. భామ నిద్రపోవడంలేదు; 'అబ్బా' అని మట్టుకు రెండో వేపు తిరిగి పడుకుంది. ఆ వచ్చినమనిషిని చూడకుం డానే 'అబ్బా' అంటున్నదేమో అనుకున్నాను. ఆరోజున ఆమెకు నీరసంగానూ, బధకంగానూ ఉన్నదేమో? వాళ్ళమ్మ రెండుమూడుసార్లు చెప్పింది. వినకపోతే ఆట్టే విసుక్కోకుండానే, కొంచెం సవరించుకొని అద్దంలోచూసుకుని, రెండోగదిలోకిపోయి తలుపువేసు కుంది. అలంకరించుకుని పడుకున్న భామవేపుచూస్తూ అల్లాఉండిపోయాను. కొంచెంసేపులోనే ఆమె ఏడు స్తూందని గ్రహించాను. నిండునేత్రాల భామ! ఎప్పుడూ శృంగారించుకొనేవుండే భామ! భామఎందుకు కంటతడి

పెడ్తోంది? నాకు చాలావిచారంవేసింది. నాగదిలోకి వెళ్ళిపోయాను. కాని మనసు పెద్దఆందోళనలో పడ్డది. పోనీ, వెళ్ళి ఓదారుస్తే! ఏమని ఓదార్చను? అస లేమిమిష పెట్టుకుని వెళ్లను? ఎప్పుడూ నవ్వుముఖం తోనే ఉండే భామ ఏడుస్తోంది!

ఆ మర్నాడు సాయంకాలం భామ డాబామీదికి రాగానే, అప్రయత్నంగా 'భామా, మీదికిరా' అన్నాను. అట్లా చటాలున ఎట్లా అనగలిగానో నాకే తెలియదు. ఆమెతోగాని, ఆమె తల్లితోగాని, నే నది వరకెప్పుడూ మాట్లాడలేదు. కాని తరుచూ చూస్తూం డడం నుంచీ, ఒక యింటిలోనే నివసించడంనుంచీ, ఒక విధమైన స్నేహపరిచయమూ, చనువూకూడా మా హృదయాల్లో లేకపోలేదు.

వాళ్ళమ్మ, నేను భామని పిలవడంవిన్నా, ఏమీ అనలేదు. భామ ఆశ్చర్యంతోనూ, కొంచెం సిగ్గు తోనూ వచ్చింది. కూర్చోమన్నాను. నిజంగా చెబు తున్నాను; నాజూకైన అమ్మాయి, నేను పిలవగానే రావడమూ, నాతో చనువుగా కూర్చోడమూ, నాకు సరదావేసింది; గర్వంకూడా కలిగింది! అసలు ఎట్లా మాట్లాడడం తెలియక 'ఏంభామా, నిన్నరాత్రి ఎందు కేడుస్తున్నావు?' అని తటాలున అడిగేశాను. పాపం, ఏమనుకున్నదో, 'మీకెట్లా తెలుసు' అని అయినా

అడగలేదు. మాట్లాడకుండా చూపులు వంచుకు కూర్చుంది.

'చెప్పవూ? నాకు తెలుసులే; యిట్లాంటి వృత్తి నీ కిష్టంలేదు కదూ? పోనీలే; విడిచిపెట్టివేయ కూడదూ?' అన్నాను.

భామ ఏమీ అనలేదు; మెల్లగా కంటతడిపెట్ట సాగింది. అమ్మాయిలందరూ ఆవయసులో బాగుం టారు. ఆనోజున భామ నాకు మరీ అందంగా కనబ డ్డది. భామ కన్నీళ్ళలో ఎంత దుఃఖమున్నా, ఆమె కళ్ళలో ఎంతో మాధుర్యం, లాలిత్యంకూడా వున్నది!

అందరూ నిద్రపోయాక నిశ్శబ్దమైన చీకటిలో, ఎన్నిరాత్రు లెంతమంది విలపిస్తూంటారో అనుకున్నాను. విపరీతమైన భావాలు పుట్టసాగినాయి. ప్రొద్దున్నే లేచి, పనులు చూచుకుని, పాఠాలు ఒక్కణ్ణే చదవడం, వండుకోవడం, బడినుంచి వచ్చి ఊరికే కూర్చోడం, మళ్ళీరాత్రి ఎంతవరకో ఒక్కణ్ణే దీపందగ్గిర చదవడం, శలవుదినాల్లో రోజంతా ఏ పుస్తకమో చదువుతూ నా పడకకుర్చీలో పడివుండడం, ఏసరదాలూ లేకుండా, ఈ మహానగరంలో, ఏకాంతంగా యీ బోగం వీధిలో క్లుప్త జీవనం గడుపుతూన్న నన్నుచూసి నేనే ఎన్నో మార్లు జాలిపడ్డాను. కాని భామనిట్లా చూసేసరికి నా స్వార్థదృష్టికి మథనపడ్డాను.

భామ! భామ ఏడుస్తూంది! నేనేమో అన బోయేసరికి వాళ్ళమ్మ భామను కేకేసింది. కళ్ళు తుడుచు కుని మాట్లాడకుండానే భామ వెళ్ళిపోయింది. ఆ రాత్రి నాకు బాగా నిద్రపట్టలేదు. మనసులో ఏదో కలతగా ఉంది. భామ కంటతడిపెట్టడానికి కారణమైనానని నన్ను నేనే దూషించుకున్నాను. నే నడిగినదానిలో తప్పేమేనా వున్నదా? అయినా, ఆమె తల్లితో మాట్లాడాలెకాని ఆమె నడగడమేమిటి? ఎంత జాగ్రత్తగా మాట్లాడాలనుకుంటానో అంత పసువునై పోతూంటాను. ఛీ, ఛీ అనుకున్నాను.

ఆమె తల్లితో మాట్లాడాలెనని ఒకటి రెండుసార్లా మరునాడనుకున్నాను, గాని జంకువేసింది. ఏమైనా చీకటి పడేప్పుడు ధైర్యంచేసి వాళ్ళ గదిలోకి వెళ్ళాను. వాళ్ళప్పుడు శృంగారించుకుంటున్నారు. అదే మొదటి మారు నే నాగదిలోకి వెళ్ళడానికి. వాళ్ళమ్మ చాలా ఆశ్చర్యపడివుంటుంది. నన్నక్కడ కూర్చోమన్నది. ఏమిచెప్పడానికీ తోచక కూర్చుని ఊరుకున్నాను.

'ఏమండీ!' అని ఆమె నావేపు తిరిగింది.

'నిన్న మీ అమ్మాయితో కొంచెం మాట్లాడాను.........'

నే చెప్పేదాన్నిగురించి వినిపించుకోకుండానే 'అవును, ఏదో బుద్ధిచెప్పారట; నాకు చెప్పిందప్పుడే! మేం ఒకళ్ళమే సానివాళ్ళమనుకున్నారా? చెప్పాలె

ననివుంటే, సాధ్యమయే మంచిమార్గ మేదో చూపిస్తూ అందరినీ పిలిచి లెక్చరివ్వండి! మాపిల్లకి మటుకు యికమీదట మీ సలహా లవసరంలేదు' అని కఠినంగా అన్నది. 'ఏమిటి మాట్లాడా'రని అడుగుతుందను కున్నాను, గాని ఈ ధోరణిచూచి నిర్ఘాంతపోయాను. 'అమ్మా' అని భామ మందలించినట్లన్నది. తప్పుపని చేసినవాడిలా నేను మాట్లాడలేకపోయాను. పరాభవ పడినట్లు అయిపోయింది. మాట్లాడకుండా నాగదిలోకి వెళ్ళిపోయాను. అవును, మహా ఉద్ధరిస్తున్నట్టు ధర్మోప దేశం చెయ్యడానికి నేనెవణ్ణి? ఈసమస్య ఎట్లా పరిష్కారం చెయ్యవలిసుంటుందో నాకేమేనా తెలుసా?

ఇది జరిగినతరువాత, నేను మళ్ళీ వాళ్ళతో మాట్లాడలేదు. నాతప్పేమీ లేకపోయినా ఏదో భావం మాత్రం నన్ను బాధించసాగింది. నాలోపుట్టిన ఈ కలతకి అర్థంఏమిటీ? భామకూడా ఎప్పట్లాగా డాబా మీద శృంగారించుకుని నా ఎదటపడడం లేదు కొద్ది దినాల్లోనే ఎవరిధోరణిలో వాళ్ళు పడిపోయాము.

రెండేళ్ళు, రోజూ యించుమించు ఒక్కలాగే, నా జీవితం ఆ సందులో గడిచిపోయింది. నా జీవిత మెంత సుఖదరిద్రమైనదైనా, దినా లెంతత్వరగా గడిచిపోయి నయి! భామకళ్ళా, భామేనా నన్నంతగా ఆకర్షించి నది? పరీక్ష లయిపోయినవి. ఆ ఇరుకుసందు విడిచి, మాగ్రామం వెళ్ళిపోడానికి ఎప్పట్లాగా నా కెందుకు

ఆత్రుత కలగడంలేదు? స్వగృహానికి వెళ్ళడానికి హృదయం ఎందుకు తహతహ పడడంలేదు? ఇంతగా ఆనందుతో నాకేర్పడిన బంధముయొక్క ఆకర్షణా రహస్యమేమిటి? ఇక్కడ నా ఉత్సాహానికీ, సంతోషానికీ భామేనా కారణం? భామ ఎప్పుడేనా నన్ను గూర్చి తలపెట్టివుంటుందా? ఈవృత్తిలో వున్నవాళ్లకు ప్రేమానురాగబంధ ముంటుందా? ఈ వృత్తి ఒక అలవాటుకాదా? హృదయ జనితమైన ప్రేమాను రాగమూ, మానవస్వభావంలో యిమిడివున్న స్నేహాను రాగమూ, ప్రమాదమాత్రమైన సంఘటనలవల్లా, అలవాట్లవల్లా, జీవితపు తీరువల్లా, మరుగుపడితే మరుగు పడవచ్చునుకాని, పూర్తిగా నశిస్తుందా? ప్రేమించే హృదయము ప్రేమించకుండా ఉండగలదా? మైత్రి నభిలషించే మానవస్వభావము స్నేహాన్నభిలషించ కుండా ఉండగలదా? నేను పడకకుర్చీలో కూర్చు న్నప్పుడు, భామ డాబామీదికి వచ్చినప్పుడు, ఎన్ని మార్లు మాచూపులు కలుసుకోలేదు! నేను మేడమెట్లు దిగుతున్నప్పుడు, భామ వాళ్ళ రెండవఅంతస్తు వసారా మీదికి రావడం ఎన్నిసార్లు తటస్థించలేదు! తటస్థ పడ్డప్పుడల్లా, ఆమె ఎందుకల్లా తడబడేది? ఈ చిన్న సంఘటనలకోసం నా మనసెందుకు ఆరాటపడేది? ఆమె చూపుల్లో అర్థంలేదూ? ఆమె నిండునేత్రాల్లో నాకు లేని దేమున్నది......

మా గ్రామానికి దగ్గరలోనే నాకుచిన్న ఉద్యోగ మయింది. పాపం, నాకోసం ఎంతో కష్టపడి చదివించిన మాఅమ్మ నాకుద్యోగమయిన రెండుసంవత్సరాల లోపునే, ఆరునెలలక్రిందట, చనిపోయింది. అమ్మ ఉన్నన్నాళ్లూ అన్నిటికీ అమ్మేఅన్నసంగతి తెలుసుకోలేకపోయాను. చదివించినందుకు, విద్యపూర్తిఅయి, యిబ్బంది లేకుండా జీవనంగడపడానికి చాలినఉద్యోగం కూడా అయిందని అమ్మ ఎంతో సంతోషించింది. 'ఇక నువ్వు పెళ్ళిచేసుకుని ఒకఇంటివాడవై వుంటే చూడాలని ఉందిరా' అని బహుముచ్చటపడ్డది. ఆమెకోర్కె నెరవేర్చలేకపోయాను. ఏమిచెయ్యను? బోగంవాళ్ళ సమస్య నాజీవితంలో ఒకసమస్య ఐపోయింది. ఇదివరకే తీవ్రంగా ఆలోచించాను. ఒక నిశ్చితాభిప్రాయానికి వచ్చానుకూడా. రెండుసంవత్సరాలు, నేనూ భామా ఆనందులో ఒక్కయింటిలోనే జీవితంగడిపినాము. మా పరిచయం తక్కువైనా ఒకరినొకరు బాగా ఎరుగుదుము. భామలేని నాజీవితం సంపూర్ణమైనదికాదని నాకు తెలుసును. చేసుకోగలిగితే భామనే వివాహం చేసుకోవాలి, లేదా, అవివాహితుణ్ణిగానే జీవితం గడపాలి. కాని, భామను పెండ్లాడడం తప్పుపనికాదని అమ్మకునేను నచ్చచెప్పగలిగేవాణ్ణా? నచ్చచెప్పలేనపుడు ఆమెకు ఊరికినే బాధకలగచెయ్యడం ఎందుకు? అందుచేతనే ఇంతవరకూ వివాహాన్ని వెనక్కుతోస్తూ

వచ్చాను. పాపం, అమ్మకోర్కె నెరవేర్చలేక పోయాను ?

ఏది ఎట్లావున్నా, ఏ కొరతా రాకుండాచూచేది అమ్మ వున్నన్నాళ్ళూ. ఆమెపోయి సంవత్సరందాటింది. ఇప్పుడు నాకు కావలసిన వాళ్ళెవ్వరూ లేరు. నన్నాదరించేవారూ లేరు; నా ఆదరణ నభిలషించేవారూ కనపడరు. ఎంతకాలం ఈ ఒంటరి జీవనం ? స్నేహామూ, ఆప్యాయతా, బంధుప్రీతీ తలపుకు వచ్చేసరికి మనసుకొచ్చేదీ, హృదయానాన్నారాటపరిచేదీ భామేకదా ?

లోకుల మోటుమాటలుతప్ప నా వివాహానికిప్పు డభ్యంతర మేమున్నది ? నాకు తెలియకుండానే నాజీవితంలో భామ ఎప్పుడు ప్రవేశించిందో, అప్పుడే వేశ్యాసమస్యకూడా నా జీవితంలో ఒక సమస్యగా పరిణమించింది. ఇది నా వ్యక్తిగత సమస్యే కావచ్చును. సాంఘికరీత్యా, యుక్తమైనదీ, ఆచరణ సాధ్యమైనదీ అయిన నిర్దుష్ట పరిష్కారమార్గము సూచించే సమర్థత నాకు లేదు. స్నేహామూ, సానుభూతీ ఉన్నచోట ఏసమస్య అయినా సులభసాధ్య మవుతుందనిమట్టుకు తెలుసుకున్నాను. ఏమయినా, నాజీవితంలో ఈసమస్య తటస్థపడినంతవరకు, నే ననుసరించవలసిన మార్గమేదో నాకు స్పష్టంగానే గోచరించినది. కాని, భామతల్లి అంటే నాకింకా జంకు వదలలేదు. భామ బాగా యీడూ జ్ఞానమూ వచ్చిన పిల్లే; అయినా తల్లి ఈ

వివాహానికి అంగీకరించకపోతే? ఏమయినా క్రిష్టమస్ సెలవలికి ఆఊరు వెళ్ళకుండా ఉండలేకపోయాను.

మళ్ళీమూడున్నరఏళ్ళకు ఈఊరు వచ్చాను. ఇన్ని వేడుకలూ, సరదాలతో కూడిన ఈ మహానగరంలో పూర్వస్మృతులతో కూడిన ఆ ఇరుకుసందే నన్ను ప్రధానంగా ఆకర్షిస్తూంది. వచ్చిననాడు సాయంకాలమే, చీకటిపడే వేళకు, ఆసందుకి వెళ్ళాను. ఆసందులో చాలామంది నాకు ముఖపరిచయస్తులే. తెలిసినవారెవ్వరూ తటస్థపడకుండా ఉండేందుకే చీకటిపడ్డప్పుడు వెళ్ళాను. తిన్నగా, నేనిదివరకువున్న ఇంటివెనుక భాగాన్నివుండే భామగదివద్దకే వెళ్ళాను. భామ ఇంకా అక్కడే ఉన్నది. నన్నుచూచేసరికి ఆమె ఆశ్చర్యానికి మేరలేకపోయింది; చాలాసంతోషపడ్డది. నిజానికి, ఆమెతల్లి మరణవార్తవిని నేనూ సంతోషించాను! అయితే, భామ అన్నిటికీ తానేపెద్దయి సిద్ధపడవలసివచ్చిన దన్నమాట!

చాలా సేపు అన్నిసంగతులూ మాట్లాడుకున్నాము. మెల్లిగా ప్రసంగంలో ఎత్తాను; 'అవాళ మనం మాట్లాడుకున్నాం; జ్ఞాపకంవుందా' అని. భామ ఏమీ అనలేదు. అప్పట్లాగ కంటతడి పెట్టనూలేదు. 'భామా పెళ్ళిచేసుకుని అందరుసంసారుల్లాగా ఉండడం నీకు యిష్టంకాదూ?' అన్నాను.

'ఇష్టముంటేమటుకు మమ్మల్ని పెళ్లాడేవా రెవ రున్నారు? నీచవృత్తిలో పడిన పతితులతో మర్యాదస్తు లెట్లా సంబంధం పెట్టుకుంటారు?' అని విచారంగా నవ్వింది.

'ప్రమాదమాత్రమైన జీవితపు తీరువల్లా, అల వాట్లవల్లా సంక్రమించే నీచత్వమూ, పతితత్వమూ శాశ్వతమని ఎందుకనుకోవాలి? నేనన్నీ ఆలోచించే, నిన్నోసంగతి అడగాలని వచ్చాను. నన్ను పెండ్లిచేసు కోవడం నీకిష్టమేనా?' అన్నాను.

'మీరా! మీరా!' అని మహాశ్చర్యంతో అన్నది. భామ నమ్మలేకపోయింది. తరువాత మేం మాట్లాడుకున్నదంతా చెప్పడం ఎందుకు? భామకళ్ళు అశ్రువులతోనిండి సిగ్గుతో చూపులు వంచుకుంది. నా సంకల్పానికామె ముగ్ధురాలైందనీ, నన్ను పెళ్ళిచేసు కోవడం యిష్టమేకాకుండా చాలా సంతోష పడ్డదని కూడా గ్రహించాను. నా సంతోషానికీ మేరలేక పోయింది.

నేనా ఊళ్లో వున్న కొద్దిరోజులూ, ప్రతిసాయం కాలమూ చీకటి పడేప్పటికు భామవద్దకు వెళ్లేవాణ్ణి. ఒకరోజు నేనొక స్నేహితుడింటికి వెళ్ళాను. తిరిగి వచ్చేటప్పటికి ఆలస్యం అయిపోయింది. ఒకసారి భామని చూసివచ్చేద్దామని వెళ్లేటప్పటికి తలుపు వేసి వుంది. నాకు ఒళ్ళంతా చెమటపోసింది. మెల్లిగా

చప్పుడు చెయ్యకుండా మేడమెట్లెక్కి నారహాస్య స్థలం నుంచి చూశాను. భామా, ఒక విలాసపురుషుడూ గదిలో వున్నారు. వెంటనే మెట్లుదిగి వీధిలోకి వెళ్ళి పోయాను. కొంచెంసేపు తిరిగి, మనసు కాస్త కుదుట పడ్డాక, మళ్ళీ వెళ్లాను. అప్పటికి ఆపురుషుడు వెళ్ళి పోయాడు. నేను వెళుతూనే, భామతో 'యింకా యిట్లాంటి పనులే చేస్తున్నావా?' అన్నాను.

ఆమె మొదట తెల్లబోయింది. తరువాత ఏడ వడం మొదలుపెట్టింది. అట్లాంటప్పుడు నే నేమని ఓదార్చడం? అయినా ప్రయత్నించి ఊరుకోపెట్టాను. ఆమర్నాడు నేను వెళ్ళినప్పుడు కాఫీయిచ్చి, సిగ్గు, విచారముతో నా వెనకాల తలవంచుకొని నిలబడ్డది. నే నామెచేయి నాచేతిలోకి తీసుకుని, 'మనసునట్లా కలత పెట్టుకోకూడదు. కొత్త జీవితానికి సరిపోయేలా, ఇకముందలవరచుకుంటే చాలు. చూడూ!' అని సముదాయించాను.

నా కోటుజేబునుంచి, నేను ప్రక్కగదిలో ఉన్నప్పుడు భామ సొమ్ముతియ్యడం నేనోమారు చూచాను. అట్లాంటిపని చేస్తుందని నేనెంతమాత్రం అనుకోలేదు. చాలా ఆశ్చర్యంవేసింది. కొంచెం కోపంవచ్చిందికూడ. ఏమేనా అంటే మళ్ళీఏడుస్తుందేమో అనుకున్నాను గాని చెప్పేయడమే మంచిదనితోచి, మెల్లిగా మంద లించాను. భామఏడుస్తూ నాకాళ్లమీదపడి క్షమా

పణ వేడుకున్నది. తొందరగా అవసరంవచ్చి తీశానని, మళ్ళీ పెట్టేదామని అనుకున్నాననీ, ఏమయినా చాలా తప్పుపనే అనీ చాలాసిగ్గుపడుతూ అన్నది. ఎప్పట్లాగా మళ్ళీఊరుకోపెట్టాను.

నేను భామవద్ద ఉన్నప్పుడు రెండుమూడుసార్లు విలాసపురుషులు రావడం తటస్థించింది. ఆమె యిప్పు డావృత్తిలోలేదని నేనే చెప్పవలసిరావడం నాకు కష్టంగా వుండేది. ఇది కాకుండా భామ యింకారహా స్యంగా సిగరెట్లు కాలుస్తూందని నాకు తెలిసిపోయింది మద్యపానముకూడా చేస్తూందేమోనని అనుమానం వేసింది.

నాతప్పు నేను త్వరలోనే తెలుసుకున్నాను. ఈ వారంరోజులూ వివాహప్రయత్నం, ఆసందునుంచి యిల్లు మార్చే ప్రయత్నం, చెయ్యకుండా నేనెందు కూరు కున్నట్టు? త్వరలోనే సివిల్ వివాహచట్టరీత్యా వివా హం అయిపోతుందనీ, వేరేబస నామిత్రునిసహాయంతో కుదిర్చాననీ, ఆరాత్రే భామతోచెప్పాను. అప్పుడు రాత్రి తొమ్మిదయింది. భామ సంతోషించడానికిబదులు ఏడుస్తూ నాకాళ్ళమీదపడ్డది. నాకు మహాశ్చర్యం వేసింది. మెల్లిగాలేవదీసి ఎందుకేడుస్తూందో అడగ బోయాను. ఆమె ఏడుస్తూనే 'నేను పాపాత్మురాలిని; మీరు పెళ్ళిచేసుకోడాని కేవిధంగానూ తగను' అని ఏమేమోఅన్నది. తుదకి భామ అప్పుడు గర్భవతి

అని నాకు బోధపడ్డది. అప్పుడు నా కెట్లాఉండెనో ఇప్పుడు చెప్పలేను. అట్లాంటప్పుడు పెళ్ళిచేసుకోవడమా, మానివెయ్యడమా? సాధకబాధకాలన్నీ ఆలోచించుకునే ఒకనిర్థారణ కిదివరకు రాలేదా? నామట్టుకు నాకే ఈతర్జనభర్జన చిన్నతనంలా తోచింది. నేనట్లా మాట్లాడకుండా ఊరుకోవడంచూసి భామ దిగాలుగా చూచింది. నేను వెంటనే నవ్వుతూ, 'అయితేనేమి భామా, మనం తప్పకుండా వివాహంచేసుకుందాం' అని ఆమె చేయితీసుకుని అనేసరికి, ఆమె ఆశ్చర్యానికీ, సంతోషానికీ, కృతజ్ఞతకూ మేరలేకపోయింది. అశ్రువులతోకూడిన ఆమెదృక్కులు యిప్పటికీ నాకు జ్ఞాపకం ఉన్నవి.

విశేషించి చెప్పనక్కరలేదు. అనుకున్న ప్రకారమే మా యిద్దరికీ సుమారు నాలుగేళ్ళక్రితమే వివాహమయింది. నేను భామతోకూడా మా గ్రామ సమీపంలోనే ఉంటున్నాను. నా వేతనంకూడా కొద్దిగా హెచ్చయింది. భామకూతురికి మూడేళ్ళు నిండాయి. అచ్చు తల్లిపోలిక. ఎంతో ముద్దొస్తూవుంటుంది.

నేననుకున్నట్టు నా చిన్నప్పటి పరిచయస్థులూ, ఇప్పటివాళ్ళూ నన్నుచూసి అంతగా తొలగిపోవడం లేదు. నిజానికి నా వివాహవిషయంలోనూ, కొత్తగా కాపురంపెట్టిన దినాల్లోనూ, నా పూర్వమిత్రు లొక రిద్దరు చూపిన సానుభూతీ, చేసిన సహాయమూ నే

నెప్పటికీ మరిచిపోలేను. వారి మైత్రి యిప్పటికీ, అప్పటి వలెనే వున్నది. ఏ కొద్దిమందో నా కేసి విషపుచూపులు విసరడంతప్ప, మిగిలిన పరిచయస్తులు చాలామట్టుకు పూర్వమువలెనే నాతో చనువుగానూ, స్నేహాము గానూ వుంటున్నారు. ఏమయినా నా వివాహాజీవితం ప్రశాంతంగానే గడుస్తున్నది.

భామ కిప్పుడు పూర్వపు వ్యసనాలేవీ లేవు. నేను తిరిగి చెప్పవలసిన అవసరమే రాలేదు. ఆమె అంతర్యములోనే పెద్ద మార్పు వచ్చింది. ఆ వ్యసనా లన్నిటియందూ, బిడ్డ కలగకముందునుంచే అసహ్యాం కలిగింది. డాక్టరుదొరసాని సానుభూతితో ఇచ్చిన సలహా ననుసరించి చికిత్సకూడా జరిగింది. ఇక మాకు బిడ్డలుండబోరు. నేనేమీ అంత ఆశాభంగ పడలేదు. ఈ విషయాలన్నీ ఆలోచించే ఒక నిర్ణయానికి వచ్చాను కదా. కాకపోయినా ఇంకా బిడ్డలకోసం నాకు విశేష అభిలాష లేదు. భామబిడ్డ కొంచెం సుస్త్రీఅయినపిల్ల, జాగ్రత్తగా చూడాలనికూడా మొదట్లో డాక్టరు దొరసాని చెప్పింది. ఇప్పుడా బిడ్డకూడా ఆరోగ్యంగా ఉంటూంది.

భామ ఇప్పుడు పూర్వపు భామ కాదు. అందరు సంసారుల్లాగే నేను భోజనం చేస్తేకాని తాను భోజనం చెయ్యదు. నేను పక్కమీద కూర్చుంటే ఎంతమాత్రం తాను పడుకోదు. వద్దన్నా, కాళ్ళు

పడతానంటుంది. శుద్ధ శాకాహారమే తీసుకోవడం కాకుండా, నిత్య నియమాల్లోనూ, భక్తిశ్రద్ధల్లోనూ కొంచెం ఛాందస మబ్బుతున్న దేమోకూడాను! ఇంత ఆపేక్షగానూ, ప్రేమగానూ వుంటున్నా, మళ్ళీ ఎక్కడ లేని మొహమాటమున్నూ. నావద్ద ఆమె ఇదివర కేమి నేర్చుకున్నా, యిప్పుడు నేనామెవద్ద నేర్చుకో వలసినవి చాలావున్నాయి. ఒక్కొక్కప్పుడు ఆమె చూపే ఆప్యాయతకూ, సరళస్వభావానికీ నేనేమీ తగననిపిస్తుంది. ఇప్పటిభామను చూచి పూర్వపు భామను ఊహించలేము. ఆమె కళ్ళలోనూమాత్రం తీయని ఆకర్షణ నాకెప్పటికీ ఒక్కలాగేవుంది.

భామకూతురు, పెద్దకళ్లతో ఏమో చూస్తూ నిశ్శబ్దంగా నావొళ్లో కూర్చుంటుంది. పాత సంగతు లన్నీ జ్ఞప్తికిరాగా నాహృదయం వింతభావాలతో, వేదనతో నిండిపోతుంది. బిడ్డను ఎత్తి ముద్దాడతాను. భామకళ్ళు అశ్రువులతో నిండుతాయి; ఆమె హృదయంలో అప్పు డెటువంటిభావాలు కలుగుతాయో?

ఒక్కొక్కప్పుడు వెనకటిసంగతులన్నీ జ్ఞాపకం వచ్చి నిట్టూర్పు విడుస్తాను. బడినుంచివచ్చి వసారాలో కూర్చుని భామపాట వింటూంటే ఎంత హాయిగా వుండేది! ఆమెది ఎంత చక్కని కంఠస్వరం! హృదయం పెద్ద ఆనందంతో, గాఢమైన ప్రేమతో, ఏదో అర్థం కాని వేదనతో, యింకా అనేకమైన వింతవింత భావా

లతో నిండిపోయేది. ముందున్న మంచిరోజులు, ముందున్న సౌఖ్యమంతా ఆమె పాటలో వినిపించేది. అవి ఎంత మంచిరోజులు! ఇప్పుడుకూడా భామ బాగా పాడుతుంది. నేనామె కేదో పెద్ద ఉపకారమో, ఆమెకోసం గొప్ప త్యాగమో చేశాననీ, నా కెల్లప్పుడూ కృతజ్ఞతతో ఉండాలనీ అనుకుంటుంది కాబోలు. నన్నో దేవుడులా చూస్తుంది. అదిచూసి ఒకప్పుడు నేను మురిసిపోయినా, ఒక్కొక్కప్పుడు సిగ్గువేస్తుందికూడా. 'భామా! నువ్వనుకున్నంత ఎక్కువేమీ నాలో లేదు. నేనుచేసిన ఉపకారమూ, త్యాగమూ ఏమిన్నీ లేదు. నువ్వు నా జీవితంలో ప్రవేశించిన తరువాతనే నాకు సంపూర్ణత కలిగింది. నువ్వెంత మంచిదానివో, అందమైనదానివో, ఎంతచక్కగా పాడతావో తెలుసునా?' అని దగ్గరగా లాక్కుని గాఢంగా హత్తుకుంటాను. భామ ఎనలేని ప్రేమానురాగంతో నాకేసి చూసి నవ్వుతుంది.

ఇక చెప్పడాని కేముంది? నేనూ, భామా, మా బిడ్డా సౌఖ్యంగా జీవనం గడుపుతున్నాం.

★

# కారణం?

సెలవులింకా అయిపోకుండానే శివరావూ, రామం కలుసుకున్నారు. పరీక్షలై పోయి నెల్లాళ్ళు కావచ్చింది. తనబంధువులను చూడవచ్చుననీ, అంత కంటే ముఖ్యంగా తనస్నేహితుడు, శివరావుని కలుసు కోవచ్చుననీ, రామం ఆఊరు వచ్చాడు. వచ్చిననాటి సాయంకాలమే తిన్నగా మిత్రుడింటికి వెళ్ళాడు. అనుకో కుండా కలుసుకున్న మిత్రుణ్ణిచూసి శివరావు చాలా సంతోషించాడు.

ఇద్దరూ కాఫీతాగాక, సిగరెట్లుపీలుస్తూ షికారు పోయారు. ఈసంగతులూ ఆసంగతులూ ఖులాసాగా చెప్పుకుంటూఉండగా, ఇంతలో శివరావుఅన్నాడు కదా, 'ఒరే, ఈమధ్య నో గమ్మత్తు జరిగింది.'

'అయితే ఊరికినే కూర్చో లేదన్నమాట;ఎవత్తా ఆ అమ్మాయి?' అన్నాడు ఉషారుగా రామం.

"ఎవరో యింకా బాగా తెలీదుకాని, మంచి రకమేలాగుంది."

'కథ ఎంతవరకు వచ్చిందేమిటి; అయితే పెళ్లైన పిల్లేనా? ఎంత వయసుంటుంది?' అని మరీ ఉషారుగా ప్రశ్నించాడు రామం.

'పెళ్లైనట్టే ఉంది. అంత మరీచిన్నపిల్లకాదు' అని కొంచెం సిగ్గుపడుతూ అన్నాడు శివరావు.

'ఫరవాలేదులే. పెద్దపిల్లయితే మరీమంచిది' అన్నాడు నవ్వుతూ రామం. 'మరి కథకానీ.' శివరావు చెప్పసాగేడు: 'వారంరోజులకిందట మొట్టమొదట సినిమాలో చూశానురా ఆవిడని. నాకు రెండుసీట్లు అవతల, సరిగ్గా వెనకవరసలోనే కూర్చుంది. రెండు మూడుసార్లు ఆవిడవేపే చూశాక, నావేపు ఒకసారి చూసింది.'

"నువ్వు వెనక్కి—తిరిగి చూస్తూంటే ఏమిటలా బైతులాచూస్తున్నావని అనుకోలేదుకదా?"

"ఇందుకేన్రా మరి! ఎంతయిదిగా చూసిం దనుకున్నావు! నీలాంటి 'సినిక్' కి 'రొమాన్సేం' తెలుస్తుంది?"

"పోనీలేరా, ఏదోగమ్మత్తుకంటే అంతచిరాకు పడతావేం? తరవా తేమయింది? చెప్పరా."

"ఇంటర్‌వల్‌లోలేచి సోడా, కిళ్ళీ పుచ్చుకొని, సిగరెట్టు ముట్టించివస్తూంటే, ఆవిడకూర్చున్న వరస లోనే నాల్గుసీట్లవతల బాబిగాడు కనిపించాడు. సరే బాగుందని, ఆవిడ నాకు సరిగ్గా కనిపించేలా నిల్చుని బాబిగాడితో బాతాఖానీవేశాను. నిజంగా బ్యూటీ అని చెప్పవచ్చు."

"బాబిగాడుకాని మనకథ కనిపెట్టలేదు కదా?"

"ఆఁ, వాడిమొహం! నేను మాట్లాడేది వాడు వింటూంటే కదూ; పెద్ద రొమాన్సురాయడిలా కుర్చీ

వెనకతట్టుమీద చేతులానించి, పక్కవరసలో ఉన్న ఓఅమ్మాయిమీద సైటువేస్తున్నాడు!''

''నీలాగే!''

''పోరా! ప్రేమ నీకేమర్థమవుతుందిలే; వెంగళాయలాగ మహా హీరోపోజులో సైటుకొట్టడానికీ, 'లవ్' కీ భేదంలేదురా?''

''ఉందిలే; మరి నీ కథ కానీ.''

''సినీమా అయిపోయాక, వాళ్ళెక్కడో చూదామని మెల్లిగా ఆవిడవెనకాలే వెళ్ళాను.''

''ఆవిడతో మరెవరూ లేరూ?''

''లేకేం! ఇంకెవరో మరిద్దరు ఆడవాళ్ళూ, ఒకరిద్దరు చిన్నపిల్లలూకూడా ఉన్నారు.''

''ఆవిడపిల్లలే?''

'అనుకుంటాను' అన్నాడు, సిగ్గుతోనే శివరావు.

'అయితే అమ్మాయి అంటావేమిటిరా!' అని హాస్యంచేసి, శివరావు సిగ్గుపడుతున్నాడని మళ్ళీ వెంటనే 'కానీలే, పిల్లలుంటేమాత్ర మేమిటి' అని నవ్వుతూనే రామం హెచ్చరించాడు.

''ఎంతైనా పాతికేళ్ళకెచ్చుండవులే ఆవిడకి. నేను వెనకాలే వస్తున్నానని పోల్చుకుంది. అప్పుడప్పుడు వెనక్కి తిరిగి చూసేదికూడా!''

'ఓహో! రెండుచూపులూ, ఆమె వెనకాల

నాలుగడుగులూతోనే జయం సంపాదించావే!' అన్నాడు రామం.

"వినుమరి. వాళ్లింటిదాకా వెళ్ళాను. అక్కడ, ఇంట్లోకి వెళ్లేముందు తిరిగి నన్ను చూసినట్టేవుంది. తరవాత నేను మాయింటికి వచ్చేశాను. ఆ రెండో రోజు సాయంకాలం ఆవీధిలోంచే షికారు వెళ్లాను; ఆ ఇల్లు గుర్తు ఉందికదూ. కాని మొదట ఎవరూ కనిపించ లేదు. కొంచెంసేపు పోయాక తిరిగి ఆ యింటిముందు నుంచే వచ్చాను. అప్పుడు ఆవిడ వరండామీద నిల్చుని వుంది."

'నీకోసమే అయిఉంటుంది' అన్నాడు రామం.

"ఏమోమరి. పిల్లలుకూడా ఆమెతోనే వరండా మీద ఉన్నారు. నన్ను పోల్చుకుందనుకుంటాను. నేను దగ్గిరగా కిళ్ళీదుకాణం ఉంటే, అక్కడ సోడాతాగి కిళ్ళీలుకట్టిస్తూ, మెల్లిగా ఆవిడవేపే చూస్తున్నాను. అంతసేపూ ఆవిడకూడా వరండామీదే ఉంది. తర వాత రెండురోజులు, నేను ఆవీధిలోంచే రెండుమూడు సార్లు వెళ్ళినా, మరికనిపించలేదు. చాలా బాధ పడ్డాను. మరి కనిపించదనుకున్నాను. కాని ఆమర్నాడు, అంటే అవతలమొన్న, మళ్లీకనిపించింది. మామూలు ప్రకారం కిళ్ళీలుకట్టిస్తూ, ఆవిడవేపే చూడసాగాను. అంతసేపూ ఆవిడకూడా అక్కడే నిల్చుంది."

"మాట్లాడ్డానికి ప్రయత్నించలేదురా నువ్వా?"

"అందరూ పోయే రోడ్డుమీద మాట్లాడడం ఎలాగరా? అయినా వినుమరి. సంగతేమిటో తెలుసుకోవాలని, మొన్న చిన్నఉత్తరం ఒకటి రాసి తీసుకు వెళ్లాను."

"ఏమి రాశావేమిటి?"

"అబ్బే, ఏమీలేదు; రెండుముక్కలే. 'మనం కలుసుకోవడం ఎప్పుడు? ఎక్కడ?' అంతే; మరి వేరేమీ రాయలేదు."

"అదేం ప్రేమఉత్తరంరా?"

"ప్రేమఉత్తర మేమిటి; ఎంత క్లుప్తంగావుంటే అంతమంచిది. మొదట ఆవిడ కనిపించలేదు. కిళ్ళీల కొట్టుదగ్గిర కొంతసేపు కాలక్షేపం చేస్తూండగా వరండా మీదికి వచ్చింది. ఆ యింటిముందునుంచే వెళ్తూ, ఆమె చూసేట్టుగా ఆచీటీ వాళ్ల మెట్లమీద పడేశాను."

"తీసిందా?"

"వెంటనే తియ్యలేదు కాని, తీసేవుంటుంది. అప్పుడు కొంచెం చీకటిగా ఉండడంచేత, బాగా తెలియలేదు. తప్పకుండా తీసివుంటుందనే నానమ్మకం."

"జవాబేమైనా యిచ్చిందా?"

"నిన్న మరి ఎందుచేతో కనిపించిందే కాదు. రెండు మూడుసార్లు అటు వెళ్లి సోడా పుచ్చుకున్నాను; కాని, ఎంతసేపుచూసినా లాభంలేకపోయింది. అసలు

వరండామీదికే రాలేదు. నిజంగా అంత ఆశాభంగం ఎప్పుడూ కాలేదురా."

"నిన్న దేనా తొందరపనిలో ఉండిఉండేదేమో; ఇవాళ జవాబివ్వకూడదా?"

"దానికే ఇవాళ ఎదురుచూస్తున్నాను. ఇదిగో, వాళ్లింటికే వెళ్తున్నాం. తెలుస్తుందిలే సంగతేమిటో."

"మరి నేను కూడా వుంటే బాగుండదేమో?"

"బాగేమిటిరా? ఫరవాలేదు లేరా. కిళ్ళీకొట్టు దగ్గిర, చూడనట్టు సోడా తాగుతూందువుగాని."

ఇంటిని స్నేహితులిద్దరూ సమీపించేప్పటికి సరిగ్గా ఆవిడ పైకి వచ్చింది.

"అదుగో, ఆ అమ్మాయేరా" అన్నాడు మెల్లిగా శివరావు, ఉత్సాహం కనపరుస్తూ.

ఇంకా శివరావు వాక్యం ముగియకుండానే, ఆవిడ నవ్వుతూ, 'ఏంరా, తమ్ముడూ! ఎప్పుడు రావడం?' అని రామాన్ని సంబోధించింది.

మరి మాట్లాడకుండా ఎందుకు శివరావు హఠాత్తుగా వెళ్ళిపోయాడో, 'ఎందుకు వెళ్ళిపోతున్నావు? అక్క యింటికి వెడదాం, ఉండు' అని రామం ఎందుకు స్నేహితుణ్ణి అడగలేదో, కారణం తెలియదు; మళ్ళీ స్వేచ్ఛ ప్రేమవాదులే ఇద్దరు మిత్రులున్నూ.

*

# కొళిధిగాంవ్ ధాన్యం మిల్లు

192 ... సంవత్సరంలో చిల్కాసరస్సు సమీపంలో ఉన్న కొళిధిగాంవ్, కంపెనీపనిమీద నేను వెళ్ళవలసివచ్చింది. కొళిధిగాంవ్, స్టేషనుకు మూడు మైళ్ళదూరంలో ఉంది. సూర్యాస్తమయంకాకుండానే కొళిధిగాంవ్ చేరుకున్నాను. తిన్నగా, ధాన్యంమిల్లు యజమాని, బహదూర్ శాశ్మల్లుయింటికే వెళ్ళాను. కొళిధిగాంవ్ అట్టే పెద్దగ్రామంకాదు; అన్నీ గడ్డియిళ్లే; ఒక్క శాశ్మల్లుదే పెంకుటిల్లులాగా ఉంది. ఆ యిల్లేనా పెద్దఆవరణ అదీ వున్నా, అంత ఆహ్వానకరంగా కనిపించలేదు. శాశ్మల్లు వరండాపైనే పడకకుర్చీలో కూర్చొనివున్నాడు. మనిషినిచూసి నేను నిర్ఘాంతపడిపోయినాను. దీర్ఘంగా ముదిరిన చర్మవ్యాధితో బాధపడుతున్నట్టున్నాడు. దగ్గరకూర్చొని మాట్లాడడానికే ఎంతో రోతపుట్టింది.

నేనువెళ్ళింది ధాన్యంమిల్లు చూడడానికే కనుక, తణిఖీచేసి, లెక్కలు వగైరా తయారుచేయడం ఆ రెండవరోజు చేయవచ్చుననీ, తనమనిషిని పంపుతాననీ, ఆరోజు కక్కడే వుండమనీ, శాశ్మల్లు నన్ను కోరాడు; కాని అక్కడ ఉండడానికి నా కెంతమాత్రమూ ఇష్టం కలుగలేదు. నాతోకూడా ఒకనౌకరు

వచ్చాడనీ, ఇద్దరమూ రాత్రికి స్టేషనులోనే పడుకొని మర్నాడు ప్రొద్దున్నే బయలుదేరి ధాన్యంమిల్లుకి వస్తామనీ, వారిమనిషిని అప్పటికి అక్కడ హాజరుగా ఉండేటట్టు ఏర్పాటుచేయమనీ, వీలైతే ఆ రెండవరోజే పని ముగించుకొని రాత్రిరైల్లో కొళిథిగాఁవ్ విడిచిపెడదామనుకుంటున్నాననీ, శాస్త్రుల్లుతో చెప్పి, ఆ రాత్రికి స్టేషనుకేపోయి అక్కడే గడిపివేశాను.

ఆ రెండవరోజు ప్రొద్దుటే వంటసామగ్రి, వగైరా స్టేషనుదగ్గిరే పట్టించుకొని ధాన్యంమిల్లుకి బయలుదేరాను. ధాన్యంమిల్లు కొళిథిగాఁవ్‌కి సుమారు నాలుగు ఫర్లాంగులదూరంలో ఉన్నది. మిల్లుకు ఆవల రెండు ఫర్లాంగులదూరంలో చిల్కాసరస్సువేపు బురద, నిండుగా పెరిగినగడ్డితోకూడిన తంసర మొదలవుతుంది. మరి అటువేపు గ్రామాలేవీ లేవు. జాలరివాళ్ళపల్లెలు ఒకటి రెండు కొళిథిగాఁవ్ సమీపంలో, ధాన్యంమిల్లుకు దిగువనే ఉన్నాయి, కాని ఆవల చిల్కాసరస్సువేపు మరేమీ లేవు.

ధాన్యంమిల్లు స్థాపించి ఎనిమిదేళ్ళయిందిట. మొదటిలో మంచిలాభాలుచేసుకొన్నా ఏకారణం చేతనో ఆరునెలలయి పనిలేకుండా ఉండిపోయిందిట. ఆమిల్లు మళ్ళీపనిచేస్తే లాభముంటుందో లేదో తెలుసుకోడానికీ, యంత్రసామగ్రీ వగైరా విలువకట్టడానికీ నన్ను మా కంపెనీవాళ్ళు పంపించారు. నేను వెళ్ళే

టప్పటికి శాశ్మల్ తాలూకుమనిషి అక్కడ హాజరుగానే ఉన్నాడు. రోజంతా నాపని చూసుకున్నాను; కాని తెమిలిందికాదు. ఆరాత్రికి స్టేషనుకుపోయే దేమిటని అక్కడే ఉండిపోవడానికి నిశ్చయించేశాను. 'ఇక్కడేమిటిబాబూ; స్టేషనుకేపోయి పొద్దున్నేవచ్చేద్దాము' అని నౌకరుకుర్రవాడు అన్నాడు, కాని మంచిగాలి వీస్తూండడంవల్లా, చిల్కావద్దకి షికారుగాపోయివద్దామని అనిపించీ, రాత్రికి అక్కడే ఉంటానని చెప్పి, నౌకరును కొళిథిగాంవ్ నుంచి బియ్యం, కూరలు మొదలైన సామగ్రి వంటకు తెమ్మనిపంపి నేను చిల్కావేపుగా షికారు పోయాను.

చిల్కాతీరాన ఎటువంటి సంచారమున్నూ లేక నిశ్శబ్దంగా ఉంది. ఆరోజుకు పనిచాలించుకొని జాలరివాళ్లంతకుముందే యిళ్లు చేరుకున్నారు. సూర్యాస్తమయమైన తరువాత ఆస్థలమెంత ప్రశాంతంగా ఉన్నది! చాలాసేపు అక్కడే పచారుచేసి, నక్షత్రాల వెలుగులో చక్కగా కనిపిస్తున్న దారివెంబడే తిరిగి మిల్లుకువచ్చేశాను. మిల్లువద్ద ఇంకెవ్వరూ లేరు; ఒక్క కాపలావాడుమాత్రం ఆ ఆవరణలోనే భార్యతోను, కూతురుతోను ఉంటున్నాడు. వరండామీద నాతో తెచ్చిన పెట్రోమాక్సుదీపం వెలిగించి, రెండురోజులక్రిందటి ఆదివారపు పత్రికను తీరికగాతీసి చదువసాగాను. కాపలావాడు — దండాసీ

కులానికి చెందినవాడు, కొంచెం ముసలివాడు — నమస్కారంచేసి దూరంగా కూర్చొని కుశలప్రశ్నలు వేస్తున్నాడు. వాడి కుటుంబంసంగతులూ, చిల్కాలో ఏ మాసాల్లో చేపలు బాగాదొరుకుతవో, నీటిబాతుల కొఱకు దొరలు ఎప్పుడెప్పుడు వస్తూవుంటారో మొదలైన సంగతులన్నీ చెప్పసాగాడు. నాతోవచ్చిన నౌకరుకుఱ్ఱవాడు కాపలావాడి కూతురుతో కబుర్లు చెబుతూ నింపాదిగా వంటప్రయత్నం చేస్తున్నాడు.

సుమారు తొమ్మిదిగంట లయింది భోజనం అయ్యేటప్పటికి. చాలా మనోహరంగా వేస్తూవున్నది చిల్కాసముద్రపు గాలి. అక్కడ ఉన్న పాతబల్లమీాద నాకు పక్కఅమర్చి నౌకరు, 'బాబూ, దండాసీవాడి యింటిదగ్గరఉంటాను' అని చెప్పి కాపలావాడి యింటి వేపు వెళ్ళాడు. ఎలెక్ట్రిక్ టార్చి, కఱ్ఱ దగ్గర పెట్టుకొని దీపం ఆర్పేసి పడుకున్నాను.

పదకొండు గంటలో పన్నెండు గంటలో అవుతుంది. ఏదోశబ్దం — వినడానికి శ్రావ్యంగానే ఉన్నదా ధ్వని — మెల్లగా నాచెవుల్లో క్రమేణా ప్రాకసాగింది. అది బాగా దగ్గరగావచ్చినవరకూ నాకు పూర్తిగా తెలియిరాలేదు. తలఎత్తి ఆ శబ్దం వినవస్తున్నవేపు చూశాను. కాగడాలతో, ఒక పల్లకీ మోసుకుంటూ ఈదారినే బోయీలు వస్తున్నారు. ఇంత రాత్రివేళ ఈదారిని ఎక్కడికిచెప్మా వెళుతున్నారు అనుకున్నాను.

చిల్కా-సరస్సుతప్ప మరేగ్రామానికీ ఇటువేపు మార్గం లేదే; లేక ఏదేనా అడ్డుదారి చిల్కా-తీరంనుంచే ఉన్నదా? ఆలోచిస్తూవుండగానే పల్లకీ మిల్లుదాటి పోయింది. మిల్లుసమీపించినప్పుడు పల్లకీలో ఎవరున్నారనిగాని, పల్లకీతో ఎవరు వెళుతున్నారనిగాని, నిదానంగా చూచినజ్ఞాపకం నాకులేదు. మిల్లుదాటిపోతూ ఉన్నప్పుడు బెదురుకంఠంతో 'ఆగు, ఆగు' అని స్త్రీ కంఠస్వరం కాని నాకు వినిపించిందా ఆపల్లకీలోనుంచి? మసకనిద్రలేచి పరధ్యానంలో ఉండడంచేత సరిగా చెప్పలేను. నా ఆశ్చర్యం పూర్తిగా తీరకముందే పల్లకీబోయీల కేకలు అకస్మాత్తుగా ఆగిపోయినవి. పల్లకీదించారేమోఅని అటువేపుచూశాను. పల్లకీ కాని, కాగడాలుకాని మరికనిపించలేదు. ఇదేమిటి! ఇప్పుడేకదా ఈమిల్లుప్రక్క-నుంచి వెళ్లాయి! ఇంతసమీపంలో ఇంతఅకస్మాత్తుగా ఎట్లా మాయమవగలవు? నాకు భయమూ ఆశ్చర్యమూకూడా ఒక్క-సారే కలిగినవి. దగ్గరఉన్న టార్చి, కర్ర తీసుకొని వరండామీద నుంచే కాపలావాడికోసం 'నాయకో, నాయకో' * అని కేకవేశాను. ఎవరూ పలకలేదు. అప్పుడుమట్టుకు నాకు విపరీతమైన భయంవేసింది. ఏమయినా టార్చి,

---

* దండాసీవాళ్లను 'నాయకో' అని ఒరిస్సా ప్రాంతాల్లో సంబోధిస్తారు.

కఱ్ఱ తీసుకొని కాపలావాడి ఇంటిదగ్గరకు వెళ్ళాను. పైని నౌకరు కాని, కాపలావాడు కాని, వాడి కుటుంబం కాని లేరు. కొంపతీసి అంతా ఎక్కడికేనా వెళ్ళిపో లేదు కదా! ఇంతలోనే తటాలున జ్ఞాపకంవచ్చి, తలుపుపైన టార్చివేసి చూచాను. పైని తాళం వేసిలేదు. తలుపు తోసిచూశాను. లోపల ఘడియవేసి ఉన్నది. అప్పుడు నాకు కొంచెం ధైర్యంవచ్చింది. తలుపుతట్టి మళ్ళీ బిగ్గరగా పిలిచాను. ఈమాటు కాపలావాడు నిద్రలేచి కంగారు పడుతూ తలుపు తీశాడు.

'ఏమిరా, యింతనిద్ర! మిగిలినవాళ్ళేరి?' అనికోపంగా అడిగాను. వాడు కంగారుతో 'బాబూ, రాధాప్రేమరాల నాటకం చూడడానికి కొలిథిగాంవ్ వెళ్లారు. నాకుబాగా నిద్రపట్టింది. ఏం బాబూ, యిలావచ్చారు?' అన్నాడు. పల్లకీసంగతి వాడికి చెప్పి, 'రా, త్వరగావెళ్ళి చూసివద్దాం' అన్నాను.

'ఏమిటిచూస్తాం? నిద్రపొండి బాబూ; నేనూ వచ్చి అక్కడే పడుకుంటాను' అన్నాడు.

''లేదు, ఒక్కసారి వెళ్లివద్దాంపద. ఇప్పుడే కదా పల్లకీబోయీలు ఇలావచ్చారు. ఒక్కసారిగా కాగడాలూ, పల్లకీబోయీలూ మాయమయిపోయి నట్లు నిశబ్దమైపోయిందే. చాలా చిత్రంగాఉన్నదే!''

వాడు అన్నాడుకదా 'కోపపడకండి బాబూ, నేనుకూడా చాలాసార్లు చూశాను. ఈ మిల్లు మలుపు దగ్గర కనిపించి మాయమవుతుంది.'

నే నాశ్చర్యంతో 'అయితే అది దెయ్యమో, భూతమో అనా నీ అభిప్రాయం ?' అని అడిగాను.

"అవునుబాబూ; తమతో చెప్పడానికి సందే హించాను."

నేను నమ్మలేకపోయాను. ఇప్పుడేకదా మిల్లు దాటి పల్లకీ వెళ్ళింది. కొన్నిగజాలదూరంలోనే ఉండి వుండాలి. 'ఏమయినా అంతవరకూ వెళ్ళివద్దాం రా' అని బదకిస్తూవున్న కాపలావాణ్ణి తొందరపెట్టి పల్లకీ వెళ్ళినవేపే టార్చ్ వేసుకుంటూ వెళ్లాను. కాపలా వాడు చెప్పినట్టుగానే పల్లకీగాని బోయీలుగాని, వాళ్ల సంచలనంగాని ఏమీ కనిపించలేదు. మరీ ఆశ్చర్యంతో దండాసీవాణ్ణి కూడారమ్మని తంపరవరకూ వెళ్లాను. రోడ్డు అక్కడితో సరి. ఎవరూ, ఎటువేపు చూసినా లేరు. ఎట్టి అలికిడీ లేదు. కలా ? నిజమా ? నేనెప్పుడూ అంత నిర్ఘాంతపడలేదు. ఇప్పుడేకదా పల్లకీ బోయీ లను స్పష్టంగా చూశాను; వాళ్ల పల్లకీమోత కేకలు విన్నాను. భయవిస్మయాలతో ఏదో ఆలోచనలో నిమగ్నుణ్ణయిఉన్న నన్ను సంబోధించి కాపలావాడిట్లా చెప్పసాగాడు : 'అనుమానం వద్దుబాబూ. నేను

అనేకసార్లు చూశాను. ఎప్పుడూ అర్ధరాత్రి సమయం లోనే ఈదారిని కనబడుతుంది. అనేకమంది తెలియని వాళ్ళు ఇలాగే మోసపోయారు; తెలిసినవా ళ్ళెవరూ చీకటిపడితే ఈదారిని రారు.' నేనేమీా మాట్లాడక పోవడం చూసి వాడు నెమ్మదిగా, 'సందేహించకండి బాబూ; యిది గాలివిశేషమే. భూతమే కాని మరొకటి కాదు' అని, ఇంకా నేను మాట్లాడకపోవడంచేత — 'భయంలేదు బాబూ; నేనూ మీాదగ్గరే వరండామీాద పడుకుంటాను. పదండి' అన్నాడు; కాని కేవలం భయంవల్ల కాదు, నేను మాట్లాడకుండా ఊరుకున్నది. ఇటువంటి వింతసంగతి నేనెన్నడూ ఎరగను; ఇటువంటి విశేష మొకటుందని నేనెప్పుడూ అనుకోలేదు. ఒక రిద్ద రిలాంటి వింతకథలు చెప్పగావిన్నాను; కాని విశ్వసించ లేదు. ఏదో తీవ్రమైన భావనలోపడి, నిశ్శబ్దముగా ధాన్యపుమిల్లువేపు నడవసాగేను. వెనకాలే కాపలా వాడుకూడా మాట్లాడకుండా నడుస్తున్నాడు. మిల్లు చేరుకున్నాక అడిగాను, 'ఎప్పుడూ ఈ పల్లకీ, బోయీాలే కనిపిస్తారా, మరేమేనా కనిపిస్తుందా? నీ భార్య, పిల్లకూడా చూశారా? వాళ్ళకి భయం వెయ్యదా?' అని. 'ఈసంగతి యిక్కడ అందరికీ తెలుసునుబాబూ, నా భార్యేమిటి, పిల్లేమిటి; రాత్రి పొద్దుపోయాక ఈదారిని ఎవరూ ధైర్యంచేసి వెళ్ళరు బాబూ.'

"అయితే ఈరాత్రికి మరి వాళ్ళు కొళిథిగాఁవ్ నుంచి రారేమిటి?"

'లేదుబాబూ, రాత్రికి మరిరారు; తెల్లవారు ఝామునే వస్తారు. దుప్పటి, కఱ్ఱ తీసుకొని యిప్పుడే వస్తున్నాను బాబూ' అని వాడు వెళ్ళిపోయాడు.

కొంచెంసేపటి క్రిందటనే జరిగిన వింతసంగతి విషయమై ఇంకా ఆశ్చర్యపడుతూ, మేలుకునే పక్క మీద పడుకునిఉండగా, కాపలావాడువచ్చి గోడకి చారగిలబడి కూర్చొని ఇట్లా చెప్పాడు: 'బాబూ, శాశ్మల్లుకామందుగారి మిల్లు కొనడానికే వచ్చిఉన్నారట కదా.'

'అవును. బాగుంటే మాకంపెనీవాళ్ళే తీసుకుంటారు' అన్నాను.

"మొదట్లో మంచి లాభం వచ్చింది బాబూ శాశ్మల్లుగారికి. ఆరు సంవత్సరాలలో యాభై వేలు లాభం కలిగిందట. ఇప్పుడుకదా రెండు సంవత్సరాల నుంచీ నష్టంలో నడుస్తూంది. ఆరునెలలయింది, మిల్లు నడవడమే లేదు. మరేమి కూడ బెడతానని అమ్మేస్తున్నారు కాని మాగొప్పమర బాబూ."

"అవును, చాలాడబ్బు ఖర్చుచేసి కట్టించినట్టుంది."

"అనేకం ఖర్చుచేశారు బాబూ. ఈ మిల్లు కట్టడం ప్రారంభమైనప్పటినుంచీ నేనిక్కడే ఉన్నాను,

మంచి కామందుబాబూ శాస్త్రుల్లు; కాని, మర స్థాపించి నప్పుడే పెద్ద పాపమొకటి చేశారు.''

''ఏమిటది?''

''ఈమిల్లు స్థాపన చెయ్యడానికిముందు శక్తిని తృప్తిపరచాలని చేశారుబాబూ.''

''ఏమిటి చేశారు?''

''శాశ్త్రుల్లు యిద్దరు అన్నదమ్ములు. పెద్దాయనే బహాదూర్ బాబు. ఆయనకు ఒక్కడే కుమారుడు కలిగాడు. తమ్ముడికి ఒక్కర్తే కుమార్తె. ఈచుట్టు పట్ల ధనవంతులు శాశ్త్రుల్ కుటుంబమే.''

''రేపు మిల్లు స్థాపన అవుతుందనగా క్రిందటి దినమే దేవిని తృప్తిపరచాలని, మన్యం దిక్కు శక్తి విద్య నేర్చి, జొంకానాళోనుంచి వచ్చిన మాంత్రికుడు చెప్పాడుట. పెద్దపిల్ల అయి, యింకా కాపరానికి వెళ్ళని కన్యకని శక్తికి బలియిస్తే మరి నష్టంలేకుండా మిల్లు మంచిలాభంమీద నడుస్తుంది; లేకుంటే దేవి నాశనం చేసివేస్తుందిట. అలాటి పిల్లెవరూ సమయానికి ఇక్కడ దొరకలేదు బాబూ. బహాదూర్ శాశ్త్రుల్లు తమ్ముడుకుమార్తెమటుకూ యుక్తవయసు వచ్చి కాపరానికి సిద్ధంగా వున్నది. ఆపిల్లను నే నెరుగుదునుబాబూ; చాలా అందమైనపిల్ల. గొప్ప

యింటివారుకదా; సత్తికాలంబాబూ. మన కుటుంబా నికి ఒక్కర్తే ఆడపిల్ల; గొప్పగా పంపించాలి; నేనే ముహూర్తం కట్టించి పంపిస్తానని తమ్ముడితో చెప్పి, ధాన్యంమిల్లు స్థాపనకు క్రిందటిరోజునే ముహూర్తం పెట్టించి, పల్లకీలో అత్తవారిగ్రామానికి పంపించే ఏర్పాటు చేశారు.

"అమ్మాయి ఒకపల్లకీలోనూ, తల్లి ఒకపల్ల కీలోనూ ఇంకా వెనకాల ఇతరులూ, దాసదాసీలూ, పాత్రలూ, సామగ్రీ, సంవత్సరానికి సరిపోయే దిను సులూ ఒకటేమిటి, గొప్పగాబయలుదేరారు, బాబూ. పల్లకీబోయీలకు లంచమిచ్చి ఈ పిల్లపల్లకీ ఒక్కటే కొంచెంముందు నడిపించి, చీకటిపడ్డప్పుడు దారితప్పించి అర్ధరాత్రికి సరిగ్గా ఈ మిల్లువద్దకు వచ్చేటట్లు పన్నా గంచేశారు. ఆపిల్ల తల్లికోసం చాలా బెంగపెట్టు కున్నదట. ఈ ధాన్యం మిల్లుదగ్గర పైకిచూచి ఆప మని కోరిందట. కాని, కొంచెం ఎగువకు తీసుకువెళ్లి బోయీలు మరి కనిపించకుండా పారిపోయారట. జొంకానాళోనుంచివచ్చిన మాంత్రికుడు, భయంచేత నోటమాటరాని ఆ అమ్మాయిని మిల్లులోకి తీసుకు పోయి శక్తికి బలియిచ్చి, ఆమెను నగలతో కూడా అక్కడే పూడ్చివేశాడుట బాబూ. ఇది నిజమైన సంగతి."

"ఏమిటీ! తమ్ముడికుమార్తెనే హత్యచేశాడూ?"

"అవును బాబూ! శక్తికి భయపడి తమ్ముడి కుమార్తెనే బలియిచ్చేశారుట. మాంత్రికవిద్య చాలా ప్రమాదం బాబూ. మనలాటివారు వాటిజోలికే పో కూడదు బాబూ. శక్తి ఏమికోరితే అది యిచ్చెయ్యా లని, దగ్గరేమిటి దూరమేమిటి, ఎవరయినా బలిఅయే ప్రమాదముంది; బెడిసికొడుతుందని జడిసి ఏపనైనా చేస్తారు. అందుకే చెప్పానుబాబూ, మనకి తగదు. నాశనం తెస్తుంది. బహదూర్ బాబు కనికారంగల కామందేను బాబూ. జొంకానాళో మాంత్రికుడి ఆశ మాట లాలకించి సర్వనాశనంఅయింది."

"ఈమాట పైకి తెలియకుండా చాలా సొమ్ము ఖర్చుచేసి బందోబస్తుచేశారు. అధికారుల నోరుకట్టినా ఊరివాళ్ళ నో రెవరు కట్టగలరు బాబూ? ఇది జరిగిన కొద్దికాలంలోనే శాశ్త్రుల్లుతమ్ముడూ, ఆయనభార్యా ఇద్దరూ బెంగపెట్టుకొని చనిపోయారు. మరి ఒక్క సంవత్సరానికే శాశ్త్రుల్లు ఒక్కకుమారుడూ చెరువులో మునిగి చనిపోవడమూ, శాశ్త్రుల్లుభార్య వాంతులు వెళ్ళి మరణించడమూ జరిగింది. పాపకార్యం చేశాను, వంశం నాశనమైపోతున్నదే, అని బెంగ పెట్టుకున్నారు బహదూర్ బాబు. చాలా దానధర్మాలు చేశారు. కుమారుడి పేర ఈ గ్రామంలో పెద్ద చెరువు తవ్వించారు. ఎండాకాలంలో ఈచుట్టుపట్ల

కదే మంచినీళ్ళ చెరువు బాబూ. తమ్ముడి కుమార్తె పేర పూరీజగన్నాథంలో సత్రంకట్టించారు.''

''మొదట్లో మంచిలాభంవచ్చిన మిల్లుని, కుటుంబంలో కలిగిన కష్టాలచేత శాస్త్రుల్లు అశ్రద్ధ చేయసాగేరు. లాభాలు పడిపోవడమే కాకుండా శాస్త్రుల్లుకి పెద్దరోగంకూడా పట్టుకుంది. ఎంత విచారించినా, ఎన్ని దానాలుచేసినా పాపకార్యానికి ఫలం అనుభవించక తప్పదుకదా అని గ్రహించారు శాస్త్రుల్లు. ఇక అట్టేకాలం బ్రతకను, వంశంకూడా నశించిపోతున్నది, దైవకార్యం చేసిపోదామని రాధాకృష్ణ మందిరం కట్టించడానికి పూనుకుని చాలా సొమ్ము ఖర్చుచేసి, ఆఠోగాంనుంచి శిల్పుల్ని తెప్పించి, సంవత్సరంన్నరనుంచి పనిచేయిస్తున్నారు. గొప్ప దేవాలయం బాబూ; గొప్ప వైష్ణవమఠం. ఈ మిల్లు క్రయంచేసి, ఆధనంకూడా దేవాలయానికీ, మఠానికీ ఇచ్చివేస్తారట. అన్ని వ్యాపారాలూ వదులుకున్నారు బాబూ. ఇప్పుడు పాలూ, పళ్ళే భోజనం. నిత్యమూ రాధాకృష్ణుల భజనలతోనే కాలం గడుపుతూ ఉంటారు.''

''అయితే ఇందాక కనిపించిన పల్లకీ శాస్త్రుల్లుగారి తమ్ముడుకుమార్తె కూర్చొనివెళ్ళినదే అంటావా?''

"అవునుబాబూ; ఆ పిల్లని నే నెరుగుదును. ఆమె భూతమే ఈదారిని కనిపిస్తూఉంటుంది. మీరు నమ్మకుండా ఉన్నారనే ఈ కథంతా చెప్పాను; లేకపోతే ఈ సంగతి ఎప్పుడూ చెప్పవలసినవాణ్ణికాను బాబూ."

ఈకథ విన్నతరువాత ఆరాత్రి మరి నాకు నిద్ర పట్టలేదు.



# పాపం!

సెలవు లివ్వగానే ఆ ఊరు కాలేజీ విద్యార్థులు దగ్గరగా ఉన్న సముద్రతీరానికి విహారంగా వెళ్ళారు. అది చిన్న రేవుస్థలం. ఉండడానికి మంచివసతులేవీ లేకపోయినా, దేవాలయంపక్కని చక్కని తోట మటుకూ ఒకటుంది. తోటలో కాస్త బసకీ, వంట చేసుకోడానికీ వీలుగానే ఓపాకకూడా ఉంది.

పొద్దున్నే వంట సామగ్రి, కాఫీగుండా, పాలూ, పంచదారా వగైరా అన్నీ తీసుకునే బస్సుమీద బయలుదేరారు; మొత్తం ముప్ఫైమంది. అందులో ఇద్దరు లెక్చరర్లూ, నలుగురు విద్యార్థినులూ కూడా వున్నారు. అమ్మాయిలకోసం వెనకసీటు ప్రత్యేకించి, మిగతా సీట్లలో అందరూ సద్దుకునేటట్టు ఏర్పాటు చేసుకున్నారు. అమ్మాయిల సీటుకు ఎదురుగుండావున్న సీటువరసలో మటుకూ రద్దీగా ఉంది. చిన్న మేష్టారు — అంటే జూనియర్ లెక్చరరు, యింకా అవివాహితుడు — విద్యార్థులు చిలిపిచేష్టలు చేయకుండా చూసేందుకే కాబోలు ఆయన ప్రియశిష్యుడు, బాబిగాడితోకూడా, అమ్మాయిల కెదురుగుండా వున్న వరసలోనే యిరుగ్గావున్నా కూర్చున్నారు.

రెండో మేష్టారు — వయసులో అంత పెద్దవారు కాదుకాని, పనిలో చినమేష్టారుకంటే సీనియరు —

ఆయనా, ఆయనతో కలిసి మరినలుగురు కుఱ్ఱాళ్ళ జట్టూ, వంటసామానూ అదీ దగ్గిర పెట్టుకుని డ్రైవరు పక్కగా ఉన్న ముందువరస సీటులో కూర్చున్నారు. ముందువేపు సీట్లు వెలితిగా ఉండడం, వెనకవి రద్దీగా ఉండడం చూచి, రెండో మేష్టారు — అంటే సీనియర్ లెక్చరరు — కొంతమంది వచ్చి ముందు వరసల్లోనూ, మధ్యవరసల్లోనూ, సదుపాయంగా కూర్చోవచ్చు నన్నారు. అమ్మాయిల కెదురుగుండా ఉన్న వరస లోని వారెవరూ కదలలేదు; కాని, అమ్మాయిలు లేచి, 'పోనీ, మేం ముందువరసల్లో కూర్చుటాం. మీకు యిరుగ్గా వున్నట్టుంది. ఈ సీటులోకూడా కూర్చోండి' అంటూ, ముందుసీట్లలోకి వచ్చేశారు. అంతవరకూ కులాసాగానే ఉన్న వెనకవరస విద్యార్థులూ, చిన్న మేష్టారూ చిరాగ్గా మొహాలుపెట్టారు.

రెండో మేష్టారూ, ఆయనతో కలిసికూర్చున్న నలుగురు కుఱ్ఱాళ్ళజట్టూ కమలాపళ్ళు ఒలిచి అందరికీ అందజేసి, తామూకూడా తింటూకూర్చున్నారు. మిగతా కుఱ్ఱాళ్ళు, అమ్మాయిలను నవ్వింప ప్రయత్నిస్తూ, ఖబుర్లు చెప్పుకోసాగారు. సరదాగానే ప్రయాణం సాగింది.

రేవుస్థలం ఊరికి హెచ్చుదూరం లేకపోవడాన్ని సూర్యోదయమయి ఇంకా అట్టే ఎండరాకుండానే, తోట చేరుకున్నారు. తోట, సముద్రతీరానికి బాగా

సమీపంలోనే వుంది. అంతా కాఫీ పుచ్చుకునే బయలు దేరినా, తోట చేరగానే మొట్టమొదట కాఫీ ప్రయత్నమే చేయసాగారు. కాఫీ అయాక సముద్రస్నానానికి వెళదామని కొందరూ, ఇప్పుడే కాఫీ తయారయేలోగా, ఓసారి వెళ్ళివద్దామని కొందరూ, అన్నారు. ముందువరసలో రెండో మేష్టారుతో కలిసి కూర్చున్న నలుగురు కుఱ్ఱాళ్ళూ 'మీరంతా వెళ్ళి స్నానం చేస్తూండండి; కాఫీతయారవగానే అక్కడికే తీసుకువచ్చేస్తాం' అన్నారు.

'ఎందుకూ, మేంపెడతాం కాఫీ; మీరుకూడా వెళ్ళండి' అన్నారు అమ్మాయిలు, ఈ నలుగురినీ ఉద్దేశించి. కాని, కుఱ్ఱాళ్ళు ఒప్పుకోలేదు. ఆ నలుగురు కుఱ్ఱాళ్ళజట్టూ, రెండో మేష్టారూ తప్ప, మిగతావారంతా సముద్రతీరానికి బయలుదేరారు. 'స్నానంచేసేమాటుంటే తగినంతమంది జాలరివాళ్ళను సాయం కుదుర్చుకోకుండా వెళ్ళకండి; జాగ్రత్త సుమండీ! నేనూ, ఇప్పుడే వస్తున్నాను' అని హెచ్చరిక చేశారు రెండో మేష్టారుగారు.

అందరికీ ఈత రాకపోవడంచేతా, సముద్రస్నానం అలవాటు లేకపోవడంచేతా, ఓ పది పన్నెండుమంది జాలరివాళ్ళను సాయం కుదుర్చుకునే విద్యార్థులు స్నానానికి సిద్ధమయ్యారు. అమ్మాయిలు మాత్రం

యింటిదగ్గిర స్నానంచేసే వచ్చామనీ, మరి చెయ్యమనీ అన్నారు.

ఇంటివద్ద స్నానంచేస్తేమట్టుకు మళ్ళీ స్నానం చెయ్యకూడదా అని కొంతమంది అన్నారు. మనవాళ్ళకు 'ఎడ్వెంచర్' తక్కువనీ, సముద్రస్నానం ఎంతో ఆహ్లాద కరమైనదనీ, దొరలవలె మనం సరదా లానందించలేక పోవడం శోచనీయమనీ, భయపడనక్కర్లేదనీ, జాలరి వాళ్లూ, తామూ సాయమున్నామనీ, చిన్న మేష్టారు చిన్న ఉపన్యాసమిచ్చారు. స్నానం చెయ్యడానికి కాస్త సరదాపడినట్టే ఒకరిద్దరమ్మాయిలు కనిపించారు; కాని, ఒకమ్మాయిమటుకు స్నానంచెయ్యనని నిశ్చ యంగా అనడంతో మిగతా అమ్మాయిలుకూడా మానేశారు.

కొంచెంసేపటిలోనే గంపలోపెట్టి రెండు పెద్ద గిన్నెల్లో కాఫీ, గళాసులూ పట్టుకుని నలుగురు కుఱ్ఱాళ్ళ జట్టూ, రెండో మేష్టారూ వచ్చారు. కాఫీ చూడ గానే స్నానాలుచేస్తున్నవారంతా వేగంగా ముగించేసి వచ్చారు. రెండేసి గ్లాసులచొప్పున అంతా కాఫీ సేవించాక, 'మీరు కూరలు తరగడం, పొయి రాజె య్యడం చూస్తూండండి, మేంకూడా స్నానంచేసి ఇప్పుడే వచ్చేస్తాం. మేంవచ్చాకే వంట మొదలెడదాం' అన్నారు, కాఫీ తీసుకొచ్చిన నలుగురు కుఱ్ఱాళ్ళజట్టు. మిగతా కుఱ్ఱాళ్ళూ, చిన్నమేష్టారూ తోటకి బయలు

దేరారు. తీరా వాళ్ళు బయలుదేరాక, మరికొంచెం సేపు సముద్రపు ఒడ్డునే కూర్చొని వస్తామన్నారు, విద్యార్థినులు.

నలుగురు కుర్రాళ్ళజట్టూ, రెండో మేష్టారూ స్నానానికి వెళ్లారు. వారందరికీ ఈతరావడాన్నీ, జాలరివాళ్ళ సాయంఉండడాన్నీ కాస్త లోతుకే వెళ్ళి, కెరటాలతో ఎగురుతూ ఉల్లాసంగా స్నానం చెయ్యసాగేరు. వాళ్ళు వచ్చేస్తున్నప్పుడు, కెరటాలలో కాళ్లు తడుపుకుందామని సరదావేసి, అమ్మాయిలు నీటిదరికి వచ్చారు. ఇంతలోనే కాస్త పెద్దకెరటం రాగా, అమ్మాయిలు కంగారుపడ్డారు. భయమేమీ లేదని జాలరివాళ్లూ, కుర్రాళ్ళూ, దగ్గరనే ఉండి అన్నారు. చీరెలు కొంచెం తడవడాన్ని, 'బట్టలెలాగా తడిశాయి. మేమూ కొంచెంసేపు స్నానంచేసి వచ్చేస్తాం; ఉండండి' అని రెండో మేష్టారుగారితోనూ, నలుగురు కుర్రాళ్ళజట్టుతోనూ అన్నారు, అమ్మాయిలు. వాళ్ళుకూడా సరదాగా ఒడ్డునే స్నానంచేశాక, అందరూ కలిసి తోటకు వచ్చేశారు. విద్యార్థినుల తీరూ, తడిజుట్టుకట్లనూ చూసి బహు ఆశ్చర్యంతో బాబిగాడూ, మిగతా కుర్రాళ్లూ, 'ఇదేమిటి, స్నానం చెయ్యమన్నారూ? చేసేవచ్చారూ!' అన్నారు, అదోలా మొహంపెట్టి. చిన్నమేష్టారు, సిగరెట్టు కాల్చుకుంటూ, బొమ్మలకథల మేగజైనేదో తీవ్రంగా చదువుకుంటూ కూర్చున్నారు.

'ఇదేమిటి, వంటప్రయత్నం ఏమీ మొదలెట్టే లేదా? తోటలోంచి అరిటాకులు కోసుకువచ్చారా?' అంటూ నలుగురుకుర్రాళ్ళజట్టూ వంటప్రయత్నం మొదలెట్టారు. అమ్మాయిలుకూడా వాళ్ళకు సాయపడ సాగేరు. నలుగురుజట్టులో యిద్దరుకుర్రాళ్ళూ, రెండోమేష్టారూ అరిటాకులూ, బాదంఆకులూ తెస్తామని తోటలోకి వెళ్ళారు. మిగతావాళ్ళు పేకాటాడుతూనో, బాతాఖానీ కొడుతూనో కాలక్షేపం చేయసాగేరు.

పదకొండూ, పదకొండున్నర గంటలకల్లా పప్పులుసూ, కేబేజీ, బంగాళాదుంపలుకలిపి కూరా, టొమాటోచట్నీ వగైరాలతో వంట తయారయింది. ఇంటినుంచి తెచ్చిన ఊరగాయా, అక్కడకొని తీసుకొచ్చిన కమ్మని పెరుగూ, అరటిపళ్లూ వగైరాలతో భోజనం మహాబాగావుంది. వంటలోనే కాకుండా, వడ్డనలోకూడా, వద్దని బ్రతిమాలినా వినకుండా, నలుగురు కుర్రాళ్ళజట్టుతోనూ, అమ్మాయిలుకూడా ఉత్సాహంగా పాల్గొన్నారు. ఇదిచూసి మరికొంతమంది విద్యార్థులుకూడా సాయపడ సిద్ధమయ్యారు.

భోజనాలయాక, పేకాట కొంతమందీ, గ్రామొఫోన్ రికార్డులు వింటూ బాతాఖానీచేస్తూ కొంతమందీ, తీరికగా కాలక్షేపం చేయసాగేరు. నలుగురుజట్టులో ఒకకుర్రాడు తోటమాలిని పిలుచుకువచ్చి, వాడి కుటుం

బానికి సరిపోయేలాగా మిగిలివున్న వంటకాలను యిచ్చాడు. తోటమాలితో, ఏపుగా పెరిగి, తోకాడిస్తూ వచ్చిన వాడికుక్కకుకూడా ఇంత పెట్టారు. వంటపాత్రలు తోమడానికి తోటమాలికూతురుకిచ్చి. పనులు చక్కబెట్టి, నలుగురుకుర్రాళ్ళజట్టూ, అమ్మాయిలూ సరదాగావచ్చి మిగతావారితో కూర్చున్నారు.

మూడుగంటలకి సోడా తాగివద్దాం రండంటూ చిన్నమేష్టారు లేచారు. ఆయనతో శిష్యబృందమంతా తయారయారు. నలుగురుకుర్రాళ్ళ జట్టుమట్టుకు 'ఇక కాస్తసేపుండి కాఫీ చెయ్యాలికదా, మీరు వెళ్ళి రండి; మేం ఉంటాం' అన్నారు. అమ్మాయిలుకూడా ఉండిపోయ్యారు. ఇదిచూచి, మరికొంతమంది విద్యార్థులకుకూడా ఉండిపోవాలనిపించింది. కాని, తీరా లేచారు గనక బాగుండదేమోనని, విసురుగా వెడుతున్న చిన్నమేష్టారుతో కూడావెళ్ళారు. పొద్దున్న రెండోమేష్టారుతో అరిటిఆకులూ, బాదంఆకులూ తీసుకురావడానికి తోటలోకివెళ్ళిన కుర్రాళ్ళు, తోటలో మంచి కొలనొకటుందనీ, అందులో తాబేళ్లు మెట్లుదగ్గిరగా వస్తవనీ చెప్పారు. అదివిని, కొలనువద్దకు ఒక్కసారి వెళ్ళివచ్చి తరువాత కాఫీపెడదామని సరదాపడ్డారు, అమ్మాయిలు. 'సరే, నేనుంటాను. మీరలా తిరిగిరండి' అన్నారు రెండోమేష్టారు. నలుగురు

కుత్రాళ్ళజట్టూ, అమ్మాయిలూకలిసి, ఏపుగా పెరిగిన రకరకాలచెట్లతో, చల్లనినీడలతో, ప్రశాంతంగాఉన్న తోటలోసరదాగా నాలుగువేపులా తిరిగి, కొలనువద్దకు వెళ్ళారు. తోకాడిస్తూ, విశ్వాసంతో వారివెంబడే వచ్చింది తోటమాలికుక్క. కొలను మెట్లమీద కూర్చొని, కుక్కనాడిస్తూ, పప్పుగింజలు నీళ్ళలోవేస్తే దగ్గరగావచ్చి తింటున్న తాంబేళ్ళనుచూస్తూ, ఆనందిస్తున్నారు. 'తాంబేళ్ళను చూస్తున్నారా, బాబూ' అంటూ తోటమాలికూడా అప్పుడేవచ్చాడు. ఇంతలోకే వాళ్ళకి పదిబారలదూరంలో చెంపుగట్టుపక్కని, నాగుపామో జెఱ్ఱిపోతో, పెద్ద సర్పమొకటి కనపడ్డది. 'ఎంత పెద్దపామో! చూడండి' అన్నాడు, పాముని మొదట చూచినకుఱ్ఱాడు. అమ్మాయిలు హడిలిపోయారు. 'మొగలిపెండెల్లో ఉంటాయి బాబూ, మనవేపురావు' అన్నాడు తోటమాలి. చూస్తూండగానే కొలను కావలిగట్టు పక్కనివున్న మొగలిపెండెల్లోకి పాము వెళ్ళిపోయింది. కాఫీ పెట్టడానికి వేళయిందని తొందరపడ్డారు అమ్మాయిలు. వచ్చేస్తున్నప్పుడు తోటమాలి తనపాకవద్ద, 'బాబూ! లేత కొబ్బరిబొండాములు తీసిఉంచాను. చల్లగా, తియ్యనినీరుబాబూ! మీరూ, అమ్మగార్లూ కాస్తపుచ్చుకోరా? పెద్ద పెద్ద సదువుకున్నబాబు లొస్తారు; బాగా కనుక్కోవాలని మా బాబుగారు ప్రత్యేకం కబురంపారు బాబూ'

అన్నాడు. వారంతా అక్కడే తియ్యని లేత కొబ్బరి నీళ్లు పుచ్చుకున్నారు. 'మిగతా బాబులకూ కూడా ఉన్నాయి బాబూ' అన్నాడు తోటమాలి. 'సరే ఒక ఘడియఉండి రా, వాళ్ళకు కావలిస్తే తీసుకువస్తువు కాని' అని చెప్పి, రెండో మేష్టారుకోసంమటుకూ కొట్టించిన కొబ్బరిబోండం ఒకటి పుచ్చుకుని, వచ్చేశారు.

కాఫీ, ఫలహారాలు సిద్ధమవుతూండగానే, చిన్న మేష్టారూ, శిష్యబృందమూ, సోడాపుచ్చుకుని వచ్చారు. అమ్మాయిలు అతిఉత్సాహంతో కొలనులోని తాంబేళ్ల గురించీ, పాము 'ఎడ్వెంచర్' గురించీ, కొబ్బరినీళ్ళ సంగతీ చెప్పారు; మీకుకూడా కావలిస్తే కొబ్బరి బొండాము లున్నాయన్నారు. 'సోడా పుచ్చుకున్నాం, మాకు దాహం వెయ్యడంలేదు' అన్నారు చిన్న మేష్టారు విసుగ్గా.

పావుతక్కువ అయిదుకల్లా కాఫీ, ఫలహారాలు ముగించుకొని, అంతా, సముద్రపుఒడ్డుకి షికారుగా తిరిగిరావడానికి, బయలుదేరారు. 'మీరు వెడుతూ ఉండండి; ఒక్కసారి దేవాలయం చూచుకుని ఇప్పుడే వస్తాం' అన్నారు రెండో మేష్టారూ, నలుగురు కుర్రాళ్ల జట్టున్నూ. 'పదండి; మేమూ వచ్చేస్తున్నాం' అన్నారు అమ్మాయిలు, కొంచెం వెనక్కితగ్గుతూ, వాళ్ళిబ్బందు లేమేనా మరుగ్గా తోటలో తీర్చుకుందుకుకాబోలు.

త్వరలోనే అంతా సముద్రపుఒడ్డున కలుసుకొని, తీరాన్ని ఓ అరమైలుదూరం వెళ్ళి, ఇసకలో కూచున్నారు. నలుగురుజట్లు కట్టాళ్ళూ, రెండో మేష్టారూ మాత్రం రెండుమూడు ఫర్లాంగుల దూరంలోనే వున్న 'లైట్ హౌస్' వరకూ వెళ్ళి యిప్పుడే వచ్చేస్తామని లేచారు. అప్పుడే చిన్నమేష్టారు తాను వ్రాసిన పద్యాలో, చిన్నకథలో వినిపిద్దామని జేబులోంచి కాగితాలు తీశారు. ఆయ నింకా మొదలెట్టకుండానే, అమ్మాయిలు 'మేంకూడా 'లైట్ హౌస్' వరకూ వెళ్ళి వచ్చేస్తాం' అని లేచారు. వారితో మరికొంతమంది విద్యార్థులుకూడా లేచారు. చిన్నమేష్టారు చిరాకుగా కాగితాలు మడిచి జేబులో పెట్టేసుకున్నారు.

తోటకి అంతా తిరిగివచ్చి, మళ్ళీ కాఫీ పుచ్చుకుని, అప్పుడే వస్తున్న వెన్నెట్లో ఊరికి తిరుగు ప్రయాణానికి సిద్ధంగా అన్నీ సద్దేశారు. కాని, వేళకు బస్సు రాలేదు. ఒక అరగంటసేపుచూసి, యిక బస్సుకోసం వేచి ఉండడం వృథా కాలయాపన అవుతుందేమోనని, రెండెడ్లబళ్ళు కుదుర్చుకొని వెళ్ళిపోడానికి నిశ్చయించారు. ఎంత ప్రయత్నించినా, అయిదు బళ్ళకంటే హెచ్చు దొరకలేదు.

అమ్మాయిలు నలుగురినీ ఒకబండిలో ఎక్కమన్నారు, మిగతా బళ్ళల్లో అందరికీ స్థలం సరిపోయిందికాదు. తమ బండిలో ఇంకా ఒకరిద్దరు కూర్చోవచ్చు

నని అమ్మాయిలు అన్నారు. చిన్నమేష్టారూ, బాబి గాడూ అందులో ఎక్కారు. అయినా, వంటసామా నుతో రెండు గంపలుండడాన్ని, ఇద్దరి ముగ్గురి కింకా స్థలం సరిపోయిందికాదు. ఎలాగో సద్దుకుని కూర్చో వచ్చునని బళ్లవాళ్ళన్నారు.

నలుగురుజట్టు కట్టాళ్ళా 'మేం నడిచివస్తాం... వెన్నెల బాగావుంది. ఎనిమిది మైళ్ళేకదా' అన్నారు. రెండో మేష్టారుకూడా నడుస్తానని చెప్పి, మిగతావా రందరినీ సదుపాయంగా కూర్చోమన్నారు. అదేమి ఆశ్చర్యమోకాని ఎంత చెప్పినా వినకుండా 'మేంకూడా నడుస్తాం' అంటూ, నలుగురమ్మాయిలూ బండి దిగి పోయారు.

అప్పుడే కాస్త ఉల్లాసంగావున్న చిన్నమేష్టారు ఎందుచేతో కాని, తలనొప్పి వచ్చినట్టుగా, ఖాళీఅయిన బండిలో బాబిగాడి నానుకొని మాట్లాడకుండా నడుం వాల్చి పడుకున్నారు...పాపం!



# మేం ముగ్గురం

నాకు రైల్లో తెలివి వచ్చేటప్పటికి వాన తగ్గింది, కాని చినుకులుమాత్రం టపటపమని పడుతున్నాయి. పైని చీకటిగా ఉండి, మబ్బుకూడా యింకా దట్టంగానే వున్నది. రైలు ఏదో చిన్నస్టేషనులో ఆగింది.

రైలు ఉద్యోగస్థుడొకడు 'టికెట్, టికెట్' అంటూ, నే నున్న బండీలోకి వచ్చాడు. అందరూ టిక్కెట్లు పైకితీశారు. లేనివాడిని, నేను చూస్తూ ఊరుకున్నాను. 'దిగిపో' అని అతడు గట్టిగా చెప్పాడు.

'పోనీ, సాధువులాగున్నాడు; తీర్థయాత్రలు చేసుకుంటున్నాడు' అన్నారు, దయకలవారు కొందరు.

టిక్కెట్టులేని బైరాగివా డెవడో తామున్న బండీలో కూర్చోవడ మేమిటని అసహ్యంతో చూచారు, కొంతమంది.

ఏమయితేనేమి, నన్నక్కడ దింపివేశారు; దింపి వేయడమేమిటి, యించుమించు గెంటేవేశారు.

ఇంతకాలం తిరగలేదా, యిదేమి కొత్తా అని, మెల్లిగా ఆ బురదనేలమీదనుండే వెళ్ల సాగేను. స్టేషను దీపంవెలుగులో, వానచేత అక్కడక్కడ నిలిచిన బురదనీళ్ళు మెరుస్తూ కనిపిస్తున్నాయి. ఏ ఊరయి వుంటుందా అని బల్లవైపు చూచాను. నా ఆశ్చర్యం

ఏమని చెప్పను! నాలుగేళ్ళక్రిందట విడిచిపెట్టిన నా స్వస్థలందగ్గరకే మళ్ళీ వచ్చాను. మాగ్రామం వెళ్లాలనంటే అన్నిటికంటే యిదే దగ్గర స్టేషను.

చటాలున మాయిల్లు జ్ఞాపకంవచ్చింది. ఆశతోనూ, ఆనందంతోనూ ఒళ్లు పులకితమయింది. కాని, వెంటనే నిట్టూర్చాను; ఎవరున్నారని 'ఇల్లు' అనుకునేది? కావలసినవాళ్లుంటేకద గృహం? అమ్మమ్మ గతించి ఏడేళ్ళవుతుంది. తరువాత వర్ధనమ్మ చనిపోయింది; దేవి నన్ను విడిచిపెట్టి ఆకాశంలో కలిసిపోయింది. తుదకు నాకు మిగిలినవారెవరు? ఇంకా మాఊరూ, మాఇల్లూ ఏమిటి?

అయినా, ఇల్లేమయివుంటుందో? శిథిలమయిపోయి వుంటుందా, ఎవరేనా ఉంశివుంటారా?

ఇట్లా ఏమేమో ఊహిస్తూ, అప్రయత్నంగా మా గ్రామంవేపే నడవసాగాను. చిన్న చినుకు పడుతూ, చలిగావున్నది. రాత్రి ఎంతవేళయి వుంటుందో తెలియదు కాని, రోడ్డు నిశ్శబ్దంగా, నిర్మానుష్యంగా ఉన్నది. బాగా గుర్తున్నరోడ్డు అవడాన్ని, చీకటిలోనే, బురదరోడ్డుమీదుగా పోసాగాను.

'ఇదిగో, యిక్కడేకదా జువ్విచెట్టున్నది; ఆ మలుపు దాటితే తుహానాపల్లి కాలవవంతెన' అని దారి పొడుగునా ఉండే స్థలాలన్నీ జ్ఞాపకం తెచ్చుకుంటూ వడిగానే పోసాగేను. మాయిల్లు, గ్రామం చివరని

ఏటిఒడ్డున తోటలోవుంది. స్థానాపురం మళుపుతిరగ్గానే మాగ్రామం ప్రవేశించామన్నమాటే. నా కెందు కీతొందర ? అప్రయత్నంగా, ఒక చెప్పరాని ఆసక్తితో నాకాళ్ళు ఏటిఒడ్డునున్న తోటవేపే నన్నుతీసుకు పోతున్నవి.

ఇల్లు సమీపించేటప్పటికి ఆశ్చర్యపోయాను; ఇంట్లో దీపం వెలుగుతూంది! నేను కాని మరోయింటికి రాలేదుకద! లేక, దారి తప్పి మరో గ్రామానికి వచ్చానా ? అది పనసచెట్టు కాదూ ? సరిగ్గా అదే; మాయిల్లే!

అర్థంకాని ఆవేశంతో కొట్టుకుంటున్న హృదయంతో కిటికీలోంచి చూశాను. అవతలగదిలో ఎవరో మసలుతున్నారు. గోడమీద నీడ కదులుతూంది. చమురుదీపం పట్టుకుని ఆవ్యక్తి ఈగదిలోకి రాగానే, ఎవరయి ఉంటారా, అని నిదానంగా చూచాను. నిర్ఘాంతపడిపోయాను; ఆ రేడేళ్ల క్రిందట చనిపోయిన అమ్మమ్మే! కొంపతీసి దెయ్యాల మాయకాదుకదా యిది! ఒళ్ళు జలదరించింది. నివ్వెరపోయి చూడసాగేను. వెంటనే నాకు నవ్వు వచ్చింది. ఎంత పొరపాటు పడ్డాను! ఆవిడ మా అమ్మమ్మ కాదు. దూరబంధువు; అమ్మమ్మలాగే వుంటుంది. అవును జ్ఞాపకం వస్తూంది; అప్పుడప్పుడు ఓ పిల్లను తీసుకొని వస్తూండేది కాదూ ?

తలుపు తడదామా, వద్దా అని ఒక్క క్షణం ఆగేను; తట్టడానికే నిశ్చయించాను. ఇంతరాత్రివేళ నన్నూ, నా ఇప్పటి తీరూ చూచి గాభరాపడకుండా ఉండేందుకు తలుపుతడుతూ పూర్వంవలెనే, 'బామ్మ గారూ' అని మామూలు స్వరంలోనే సాధ్యమయినంత నెమ్మదిగా పిలిచాను. అయినా, నా కంఠస్వరం పోల్చు కుంటుందో లేదో?

'ఇంతరాత్రివేళ ఎవరు నాయనా?' అంటూ ఆవిడ కిటికీదగ్గరనుంచే బయటికి చూసింది. పైని చీకటిగా వుండడాన్ని, ఆచిన్న దీపపు వెలుగులో నేను కనిపించానో లేదో? 'నేను బామ్మా! గెడ్డం పెరగ డాన్ని పోల్చుకోలేవేమో; నాలుగేళ్ళయింది ఇంటికి వచ్చి' అని నన్నెరుకపర్చుకున్నాను. ఆవిడ వెంటనే గుర్తుపట్టి 'ఎన్నాళ్ళకొచ్చావురా, నాయనా' అంటూ తలుపు తీసింది. నన్ను చూస్తూనే నివ్వెరపోయి, 'ఈ వాలకం అంతా ఏమిటి, ఇంత విరాగం దేనికి? అంతా వెళ్ళిపోయారు. వంశానికి మిగిలినవాడివి నువ్వొక్క డివి. అదృష్టవంతురాలు, మీ అమ్మమ్మ కాశీలోనే పోయింది. కాని సంసారమూ, ఇల్లూ చక్కబెట్టు కోక దేశాంతరం అయిపోవడ మేమిటిరా, బాబూ? పోనీ, యిప్పుడేనా యింటిమీద ధ్యాస కలిగింది. ఆకలి తో వున్నావు కాబోలు; ఎక్కడనుంచి వస్తున్నావు? వేడినీళ్ళు కాస్తాను; ఒళ్లు కడుక్కుని, కాస్త ఉన్న

మెతుకులే తిందువుకాని' అని ఆప్యాయంగా ఏమేమో అంటూ, 'ఒసేవ్' అని ఎవరినో కేకవేసింది.

'ఇప్పుడు వేడినీళ్లూ, భోజనం ఏమిటి? కాళ్ళు కడుక్కొని పడుకుంటాను. పొద్దున్నే చూసుకోవచ్చును. చాలా రాత్రయినట్టుంది; శ్రమేమీ తీసుకోకండి బామ్మా' అన్నాను.

'శ్రమేమిటి; ఎప్పుడు భోజనం చేశావో, ఎంత దూరంనుంచి వస్తున్నావో? మరేం ఆలస్యం లేదు; ఇన్నాళ్ళకి కనిపించావు నాయనా' అని, కాస్తసేపట్లోనే బాల్చీతో వేడినీళ్లూ, సబ్బుబిళ్లా, కొత్త తువాలూ సిద్ధ పరిచింది. శుభ్రంగా నీళ్లుపోసుకున్నాను. దువ్వెనా, నూనె, అద్దం తయారుగా వున్నవి. ఎన్నాళ్లయిందో జుట్టుకి తైలసంస్కారం చేసుకొని, అద్దంలో చూసు కొని, దువ్వుకోవడం. 'ఏమి చేస్తున్నాను, ఎందుకు చేస్తున్నాను' అనే ఆలోచనే లేకుండా, తల దువ్వు కొని, అక్కడపెట్టివున్న తెల్లని పంచె, చొక్కా చూసి ఆశ్చర్యపోయాను. అవి పూర్వం నేను వేసు కుంటూండేవే! ఎవరింకా అవి భద్రపెట్టి, యిలా తీసు కొని వచ్చివుంటారు? ఆశ్చర్యంతో మంత్రముగ్ధుడిలా, అవి వేసుకున్నాను. ఇప్పుడు మళ్లీ పూర్వపు దుస్తులు వేసుకోడం కొత్త అనిపించింది. కొంచెం నవ్వొచ్చింది.

త్వరలోనే భోజనం సిద్ధమయింది. ఇంట్లో భోజ నాలు అయిపోయినవనీ, ఆయాసంతో నాలుగేళ్ళ తరు

వాత వచ్చిన నాకేమీ సమయానికి పెట్టలేకపోయాననీ అంటూనే, బామ్మ వేడిగానేవున్న అన్నం, అప్పుడే వేయించిన కూర, ఊరగాయ ఆప్యాయంగా వడ్డించింది. ఆకలితో వున్న నాకు, తరువాత వడ్డించిన చారు, మజ్జిగ, అరటిపండుతో ఎంతో సుష్టయిన విందులా అనిపించింది. అంతసేపూ కంటతడిపెడుతూ మా అమ్మ సుగుణాలను గురించీ, వంశాన్ని గురించీ ప్రశంసిస్తూ ఏదో చెబుతూనే వుంది. నేను బాగా భోజనంచేస్తున్నా 'ఏమిరా, ఏమీ సయించడంలేదూ ? అవును, పొద్దుపోయింది; యింతకూ ఏమి పెట్టానని తింటావు' అన్నది. 'ఇదేమిటి బామ్మా ! ఇంత తృప్తిఅయిన భోజనం ఈ మధ్యెప్పుడూ చెయ్యలేదు' అన్నాను. అక్షరాలా అది వాస్తవమే.

నెయ్యి వడ్డించి, మొహమాటంతో తలుపువార నిలబడ్డ పొడుగుపాటి అమ్మాయి ఎవరా అనుకుంటూండ గానే, బామ్మ, ఆమెను చూపిస్తూ 'మాలతి జ్ఞాపకం వుందిరా బాబూ ?...ఒసేవ్ ! యిలారా' అంది.

మాలతి మొహమాటపడుతూనే కొద్దిగా దగ్గరకు వచ్చింది. చిన్నప్పుడు బామ్మతో వస్తూండేపిల్లా, ఈ మాలతి ? నాజూగ్గా, ఎంతపెద్దదై పోయింది! కాని నావిస్మయం పైకిచూపకుండా, 'ఎరక్కేం బామ్మా. చిన్నప్పుడు నీతో వచ్చేటప్పుడు ఇంగ్లీషునేర్పమనీ,

బొమ్మలపుస్తకంలోని కథలు చెప్పమనీ నన్నడిగేది కాదూ? మాలతే నన్ను మరిచిపోయి, మొహమాట పడుతూంది' అన్నాను, నవ్వుతూ. అవును, మాలతి నాకు బాగానే జ్ఞాపకంవుంది; తల్లిలేనిపిల్లఅని, మొదటి నుంచీ తనచెల్లెలి మనుమరాలిని ఈ బామ్మే చేరదీసి పెంచింది. బామ్మ మాకు దూరపుబంధువే; అయినా అమమ్మ వీరిని ఆదరించేది. ఈ చుట్టుపట్ల గ్రామమే వాళ్ళది. అమ్మమ్మపోయాకమటుకూ వీళ్లు మాఇంటికి రాలేదు. అమమ్మ వీళ్లకి చేస్తూవచ్చిన సాయమే, నేనూ, తరువాత కూడా, అప్పుడప్పుడూ సాగిస్తూ వచ్చాను. పూర్వస్మృతులు జ్ఞప్తికి తెచ్చుకుంటూండగానే, 'మాలతి నిన్నెందుకు మరిచిపోతుంది? ఎప్పుడు ఇంటికి తిరిగి వస్తావో అని రోజూ ఎదురుచూస్తూనే వుంది' అన్నది బామ్మ.

భోజనం ముగించేటప్పటికి నీళ్లూ, తువాలూ మాలతి తెచ్చిఉంచింది. చేతులు తుడుచుకున్నాక, వక్కపొడి యిచ్చింది. ఇవన్నీ విడిచిపెట్టి ఎన్నాళ్లయిందో? ఇక వారిని శ్రమపెట్టడ మెందుకని, 'వీధి వరండాలో పడుకుంటాను. చాపలేకపోయినా పరవా లేదు; అలవాటే' అంటూ, నా సంచీకోసం చూశాను. నా మాటలు వంటింట్లోఉండివిన్న బామ్మ, 'వరండాలో పడుకోవడమూ, కిందపడుకోవడమూ ఖర్మం ఏమిటి నీ ఇంటికివచ్చి? మేడమీద వాడిగదిలో మం

చమ్మా, పక్కా వేశావుటే? తీసుకువెళ్లు; నేనూ తలుపు వేసుకొని క్షణంలో వస్తున్నా' అంది. మాలతి, నెమ్మదిగా 'మీగదిలోనే ఉంచాను సంచీ. అక్కడ పక్క వేసేవుంది; పదండి' అన్నది. అవును, మిద్దెమీద ఒక్కటేగది వుంది. అక్కడే కాలక్షేపం చేస్తుండేవాణ్ణి తరుచుగా. ఇన్నాళ్ళ కా మెట్లెక్కి, నాగదిలోకి పోవడమంటే విచిత్రంగానూ, వేదనగానూ వుంది.

గదిచూచి అద్భుతపడిపోయాను; శుభ్రంగా తుడిచి ఎక్కడివక్కడ అమర్చి అద్దంలావుంది! బీరువా, మేజాబల్ల, కుర్చీ, బట్టలకొయ్య, గోడఅల్మారులో అద్దం, నూనె, దువ్వెన వగైరాలన్నీ ఎప్పటికంటే కూడా సద్ది కుదురుగా ఉన్నవి. గోడ నో కేలెండరు కూడా తగిలించివుంది. యథాస్థలంలోనే, కిటికీదగ్గిర మంచంపైని మల్లెపువ్వులా దుప్పటిపరచి పక్క వేసి ఉంది; బల్లమీద నా పూర్వపు పుస్తకాలుకూడా రెండు మూడున్నవి! కొయ్య నో తువాలూ, నా సంచీ ఉన్నవి. నేను నీళ్ళు పోసుకున్నప్పుడు విడిచిన పాత దుస్తులుమటుకూ కిందనెక్కడో ఆరవేసినట్టుంది. ఒక్కసారిగా నాలుగేళ్ల వెనకటి సుఖజీవనంలో పడ్డట్టనిపించింది! విస్తుపోయి, మాట్లాడకుండా గదిచూస్తూండగా, బామ్మవచ్చి, 'ఎమిటలా నిలబడేవున్నావు? ఆయాసంగావుంటుంది; మంచంమీదే విశ్రమించు' అంది. బామ్మకూడా పక్కమీదే కూర్చుని నాకాళ్ళు నిమర

బోయింది. 'నాకాళ్ళు పీకడంలేదు. పెద్దదానివి, నువ్వు నాకు పట్టడమేమిటి?' అని లేవబోయాను. 'నా అబ్బాయివంటివాడవే; ఏమి యిబ్బందులుపడి, ఎంత అలసి వస్తున్నావో, పడుకో' అని ఆపేక్షతో ఒళ్ళు నిమిరింది.

'అలా నిల్చుండిపోయావేమి; రా కూర్చో' అన్నాను, తలుపుదగ్గర నిల్చున్న మాలతి నుద్దేశించి.

'ఎప్పుడూ బావ, బావ అంటూ చదువు నేర్చుకుంటూండేదానివి; అంత సిగ్గుపడతా వెందుకే?' అంది బామ్మ. మాలతివచ్చి కిందకూర్చోబోయింది. 'ఇక్కడే కూర్చో, మాలతీ!' అన్నాను. వచ్చి మంచంమీద నా కాళ్ళవేపు కూర్చుంది.

బామ్మ, పూర్వపుసంగతులు తలపెడుతూ చెప్పింది: ''మీ అమ్మమ్మలాగే, నీకూ అందరిమీదా ఆదరాభిమానా లున్నాయి. మావంటి దిక్కులేని దూరపుబంధువులను చేరదీసేవా రెవరు నాయనా, ఈ కాలంలో? ఎంత ఆప్యాయతలేకుంటే మమ్మల్నే జ్ఞాపకం ఉంచుకొని, వెళ్ళేముందు మీ పొలంకాపు, చిన్నదాసుతో ఇంట్లోవచ్చి ఉండమని కబురంపుతావు! నువ్వు వెళ్ళినమర్నాడే కబు రందచేశాడు చిన్నదాసు. నువ్వంటే వాడి కెంత విశ్వాసమనుకున్నావు! అక్కడ మా కేముందని; ఎవరుచూసేవా రున్నారని? తీర్థయాత్రలు చేసుకువస్తావని అనుకున్నాంకాని, నువ్విన్నా

ళ్లిందుకురా లేదో తెలియకుండావుంది. నువ్విలా ఇల్లువిడిచినా, మమ్మాదరించబట్టే ఇన్నేళ్ళూ ఏ యిబ్బందీ లేకుండా మహారాజులా గడుస్తూంది. పొలం మీదా, తోటమీదా వచ్చేది మాకే అప్పచెప్ప మన్నావుట కదా? అలాగే ప్రతిసంవత్సరం సరిగ్గా అప్ప గిస్తున్నాడు, చిన్నదాసు. ఎప్పుడు వస్తావోఅని నిత్యమూ అనుకుంటూనే ఉన్నాం. తప్పకుండా వస్తావని, నిన్ను మాలతి తలపెట్టనిరోజే లేదు. వట్టి అమాయకపు పిల్ల. అయితే, మంచి జాగ్రత్తకలది సుమా! ఒక వస్తువుకానీ, సొమ్ము విషయంకానీ, నోటుపుస్తకంలో రాసి లెక్కలా ఉంచుతుంది. మాకు గ్రాసానికీ దానికీ ఏమీ కొనవసరం లేకుండానే సరిపోతూంది; మిగిలిన ఏడెనిమిదివందలూ ఏటా, కోపరేటుబ్యాంకులో చిన్న దాసుచేతే వేయించి లెక్కవుంచుతూంది. ఏక్షణాన్న వస్తావోఅని రోజూ నీగది తుడిచిఉంచుతుంది. నాలుగు రోజులకొకసారి నీ పుస్తకాలూ, బట్టలూ, అన్నీ సద్దు తుంది. నీ పుస్తకాలూ చదువుతూంటుంది. ఏటా, అదే పట్టుపట్టి, ఇంటికి వెల్లవేయిస్తూంది. పొద్దున్న చూతువుగాని; నువ్వువేసిన పూలమొక్కలు అలానే ఉన్నాయి. అన్నీ, అదే శ్రద్ధగా చూస్తూంది."

అవును, జ్ఞాపకం వచ్చింది; నన్నాదరించేవారు కాని, నా ఆదరణకోరేవారు కాని ఎవరున్నారని, వెళ్లే

ముందు చిన్నదాసుచేత వీరికే కబురంపాను. కాని, మాలతి ఎంత ఆప్యాయతా, అభిమానంతో నాలుగే ళ్ళయి ఇల్లు చక్కబెడుతూంది! నావంటి అదృష్ట హీనుని విషయంలో ఎందుకింత శ్రద్ధ కలిగింది? విస్మ యానందంతోనూ, కృతజ్ఞతాపూర్వకమైన ఏదో ఆవేదనతోనూ నాహృదయం ఒక్కసారిగా నిండిపో యింది. అప్రయత్నంగా లేచి, మాలతిచేతులను పట్టు కుని, 'నామీద నీ కెంతదయ, మాలతీ!' అన్నాను. వెంటనే, ఎదిగినఅమ్మాయిచేతు లలా పట్టుకున్నం దుకు సిగ్గుపడ్డాను. మాలతికూడా సిగ్గుతో తల వంచు కుంది. బామ్మమట్టుకు నవ్వుతూ, 'మామీద నువ్వు చూపిస్తున్న దయకన్నానా? నీమీద కాకపోతే మ రెవరిమీద ఉంటుంది ఆదరమైనా, అభిమానమైనా మాలతికి? నీ ఋణం అదికాని, నేనుకాని ఎప్పటికీ తీర్చుకోలేం. నువ్వాదుకోకపోతే మాగతి ఏమయ్యేది? ఆస్తి పాస్తులా, కావలసినవా రున్నారా? నువ్వు రాలేదనే చింతతప్ప, నీప్రాపుండబట్టేకదా, నాయనా, ఇంతదివ్యంగా గడిచిపోతూంది. భగవంతుని కృప వుండి, నువ్వూ క్షేమంగా వచ్చావు. ఇహా వున్న చింతల్లా దీని పెళ్ళిగురించే. చూచావుకదా ఎలా ఎదిగి పోయిందో; దిక్కులేనిపక్షికి వరులెక్కడ దొరుకు తారు? శేషన్న కొడుకులేడూ, నీళ్ళుపోస్తూంటాడు; నాలుగువందలిచ్చి నాలుగుతులాల బంగారం కూడా

పెడతానన్నాడు; మంచివాడే, చదువుసంధ్య లంత లేవు గాని; అంతకన్నా మనకేవ రొస్తారు ?'

"అదేమిటి బామ్మా, మాలతివంటి సలక్షణమైనపిల్లకు తగినవరులే కుదరకపోతారా ? అంత అందమైనదీ, నెమ్మదైనదీ, మంచిదిన్నీ ఎవరికిదొరుకుతుంది?"

"సలక్షణంగా ఉంటేమట్టుకు అడిగేవా రెవరు నాయనా ? మంచితనమూ, ఆనందమూ ఉన్నంత మాత్రాన కట్నంకానుకలు లేకుండా అందరికీ పెళ్లిళ్లవుతున్నాయా ? ఇంతకూ దానిఉద్దేశమేమిటో తెలియదు. భగవంతు డెలారాసివుంటే అలాజరుగుతుంది. ఆ శేషన్న కొడుకుని ఇది యిష్టపడిందికాదు. ఇంతగారాబంతో తల్లిలేనిదాన్ని పెంచి, బలవంతాన ఇష్టంలేని పెళ్లెలా చేసేది ? ముందుగతి ఏమిటన్న ఆలోచనే దానికిలేదు. అడిగి అడిగి విసిగెత్తి, మరోపిల్లను శేషన్నకొడుకు కట్టుకున్నాడు. నువ్వొచ్చి, నీయిల్లు నీకప్పగించేవరకు పెళ్ళిప్రసక్తి ఎత్తవద్దంది. దానికోరిక ప్రకారమే నువ్వావచ్చావు. నీ ఇల్లూ, వాకిలీ నీ కప్పగించాం. మాకు ఇన్నాళ్ళూ బాగావెళ్ళిపోయింది. ఇహ నెలా గడుస్తుందో పరమాత్ముడిదయ; దాని వివాహభారం మటుకూ నీదే. నువ్వా త్వరలో ఒక యింటివాడివవాలి నాయనా."

"అదేమిటిబామ్మా, యిల్లు నాకప్పగించడమేమిటి ? అనుకోకుండా వచ్చాను. ఈ ఇల్లూ, నాకున్న

స్వల్పఆస్తిపాస్తులూ మీకే అప్పగించే ఏర్పాటుచేసి రేపోమాపో వెళ్ళిపోతాను. డబ్బుకేమీ మీ రిబ్బంది పడనక్కరలేదు. మాలతి కిష్టమైన వరుణ్ణేయిచ్చి పెళ్ళిచెయ్యి.''

బామ్మ కంటతడిపెడుతూ, 'మతిపోయిందా, వెళ్ళిపోవడమేమిటి? ఇన్నాళ్ళకొచ్చావు. తొందరపడి తెలివితక్కువ పనేమీ చేయకు. పెద్దదాన్ని, నీహితవు కోరేదాన్ని; నామాటవిను' అని అతి ఆప్యాయంగా ఒళ్ళునిమురుతూ అంది.

నేను నవ్వుతూ, 'నిన్నుచూస్తే అమ్మమ్మని చూచినట్టేవుంది. సరే బామ్మా, తొందరపడను. మాలతి వివాహం జరగందే ఎక్కడకీ వెళ్ళను, సరేనా?' అన్నాను.

'భగవంతుడు త్వరలోనే నిన్నొక యింటివాణ్ణి చేసి, నూరేళ్ళు నీజీవితం సుఖమయం అయేటట్లుచేయాలని ఆశీర్వదిస్తున్నా బాబూ; నిద్రవేళదాటింది. అలిసివున్నావు, యికపడుకో; కిందగదిలోనే పడుకుంటాము. ఏదేనా కావలిస్తే పిలువు' అని బామ్మలేచింది. మాలతి కూడా ఆమెతో వెళ్ళింది.

రెండు మూడు గంటల కిందటికీ, యిప్పటికీ జీవితంలో ఒక్కసారిగా ఎంతమార్పు వచ్చింది! యిది కలా, నిజమా! అద్భుతపడుతూ, కిటికీలోంచి, పూర్వంలాగే, పైకిచూశాను. మేఘాలు చెదిరిపోతున్నాయి.

నక్షత్రాలు అక్కడక్కడ కనిపిస్తున్నాయి. సమీపాన్నే ప్రవహిస్తున్న ఏరు మెరుస్తూ కనిపిస్తూంది. నావంటి భగ్నజీవినికూడా ఇంతకాలం ఆదరంతో తల పెట్టేవా రుంటారని ఎవరనుకోగలరు? ఎంతఆశ్చర్యం! చిన్న చప్పుడువిని, వెనక్కి తిరిగిచూశాను. మేజాబల్ల మీద పాత్రనుంచి, మూతవేసి, నెమ్మదిగా ప్రవేశించిన మాలతి, 'మంచినీళ్ళు' అంది.

"మాలతీ, ఇలా వేళకానివేళవచ్చి, మీకు చాలా శ్రమ కలిగించాను."

"మాకేమిశ్రమ! మీరువచ్చారు, అంతే చాలు. సమయానికి పాలులేకపోయాయి; మీ కలవాటేమో?"

"కడుపునిండా భోజనంచేసి, యింకా పాలు కూడానా? ఇప్పుడా అలవాట్లేమీ లేవు. మీ కేయిబ్బందీ లేకుండా వుందా? చిన్నదాసు బాగున్నాడా? మిమ్మల్ని బాగా కనుక్కుంటున్నాడా?"

"చాలాబాగా కనుక్కుంటున్నాడు; మాకే ఇబ్బందీ లేదు. క్షేమంగా ఉన్నాడు. మీరంటే ఎంతోగురి; మీమాటంటే అతివిశ్వాసం. మీదగ్గిర నుంచి ఉత్తరమేమేనా వచ్చిందాఅని తరుచూ అడుగుతూంటాడు."

"మూడు నాలుగుసార్లనుకున్నా, చిన్నదాసుపేర రాద్దామని. ఎందుచేతోకాని రాయడం పడలేదు."

"పోనీ, వచ్చారు; ఎంతో సంతోషంగావుంది. చిన్నదాసు ఎంతైనా ఆనందిస్తాడు. మరి వెళ్లకండి."

'మాలతీ!' అని,...ఏమి సమాధానమివ్వాలో తెలియక, ఊరుకున్నాను. మాలతి ఒక్క క్షణం ఏమేనా చెప్తానేమోనని ఆగి, నేనూరుకోవడంచూసి, 'వస్తాను' అని, వెళ్ళిపోయింది.

రైల్లో చాలాసేపు పడుకోడాన్ని నాకు నిద్ర రాలేదు. కిటికీలోనుంచి తోటలోని చెట్లూ, ఏరూ చూస్తూ కూర్చున్నాను. ఆకాశం నిర్మలంగా చుక్కలతో, అప్పుడే వస్తున్న చిన్న చంద్రుడితో, ప్రకాశిస్తూంది. ఇన్నాళ్ళూ ఇమ్ముగావుంచిన యిల్లూ, పూర్వంవలె పుస్తకాలకు అట్టలుకూడావేసి, శుభ్రంగా సర్దిన నా గదీ, బావమ్మా, మాలతీ చూపిన ఆదరణా తలుచుకుంటూంటే అచ్చెరువుతోపాటు, వెనకటి సంగతులన్నీ జ్ఞాపకమొచ్చాయి.

అవి అమ్మమ్మవున్నప్పటి రోజులు. నా తలిదండ్రులను నే నెరగను. నన్ను చిన్నప్పటినుంచీ అమ్మమ్మే పెంచింది. అటువంటివా రెంతమంది ఉంటారో నాకు తెలియదు; కాని ఆమెవంటివారి ఆదరణపొందే వారు అదృష్టవంతులు. ఆమె నా కేలోపమూ లేకుండా, ఎంతో అనురాగంతో పెంచింది. అటువంటి ఆప్యాయత తలిదండ్రులేనా చూపగలరా, అనుకుంటాను. ఆమెకు విసుగన్నదే లేదు. ఆమెకూ, జీవితంలో కష్టాలు

వచ్చాయికాని, ప్రశాంతత ఒక్కింతైనా కోల్పోలేదు. ఒకరికి పెట్టడమంటే ఆమెకు సరదా; లేదని చెప్పడం ఆమెకు చేతకాదు. మాది సామాన్యమైన సంపదే కాని, మా చిన్న కుటుంబానికి చింతేమీ లేకుండా గడిచే ఉపాధి భగవంతుడు ప్రసాదించాడు. అందులోనే జాగ్రత్తచేసి, యింటి అవసరాలకు ఏమీ యిబ్బంది లేకుండా చూస్తూ, ఎప్పుడూ ఎవరినోఒకరిని ఆదరించి సాయపడేది. ముఖ్యంగా వర్ధనమ్మనీ, ఆమెకూతురు దేవినీ చాలా ఆదరించేది. పరికిణీగుడ్డలనో, ఫలహారమనో ఏదో తరుచుగా ఈ పిల్ల కిస్తూండేది.

వర్ధనమ్మకు కావలసినవా ళ్ళెవరూ లేరు. తన మంచిమీదా, ఊరుమంచిమీదా ఆధారపడేది. ఆమెకు చేతకాని పని అంటూ వుండేదేకాదు. వంటపను ల్లోనూ, ఊరగాయ పెట్టుకునేప్పుడూ సాయపడో, రెవికలు కుట్టిపెట్టో, నలుగురికీ సాయపడుతూ, ఏదో ఒక పంచని తలదాచుకుని, క్లుప్తంగా సంసారం గడుపుకొస్తూండేది. నవ్విస్తూ, నిండుగా, మహాబాగా కబుర్లు చెప్పేది.

వర్ధనమ్మ తరుచుగా దేవితో మా యింటికి వస్తూండేది. ఆమె పనితనానికీ, కబుర్లకూ అమ్మమ్మ బహుముచ్చటపడేది. ఒకసారి అమ్మమ్మకు సుస్తీ చేసింది. అప్పుడీ వర్ధనమ్మా, దేవీ వచ్చి మాయింట్లోనే వుండి బాగా సేవచేశారు. అప్పటినుంచీ వారిని బలవంత

పెట్టి మాయింట్లోనే అమ్మమ్మ ఉండమంది. వర్ధనమ్మ ఎదుగుతూన్న కూతురుతో ఒక పంచంటూ లేకుండా పదిమంది యిళ్ళల్లో పనులు చేస్తూండడం అమ్మమ్మకి ఇష్టం ఉండేదికాదు. వర్ధనమ్మనీ, దేవినీ కుటుంబం లోని వారివలెనే అమ్మమ్మ చూచుకునేది. వాళ్ళుండడం అన్నివిధాలా అమ్మమ్మకూ, నాకూ కూడా సంరక్షణ బాగా జరిగేది. దేవికికూడా వాళ్ళమ్మలాగే, అన్ని పనులూ చేతనవును. అయితే, చాలా నెమ్మదైన అమ్మాయి; వాళ్ళమ్మలాగు మాటకారికాదు.

చల్లనిగాలి ఒక్కసారి రివ్వుమని వీచింది. గది లోని చమురుదీపం వణికింది. ఏదో పురాతన దృశ్య మొకటి జ్ఞాపకం వచ్చింది : అమ్మమ్మ, సంధ్యవేళప్పుడు తులసిమొక్కవద్ద దీపంపెట్టి, ప్రార్థనచేసుకుంటూంటే పక్కనే కూర్చునేది దేవి, మహాశ్రద్ధతో. ఏమంత శ్రద్ధగా కూర్చునేదో, ఏమాలోచించేదో కాని, ఇటూ అటూ గాలికి కదిలే దీపంజ్వాల నలాగే చూస్తూ, నిశ్శబ్దంగా కూర్చునేది. ఆ దృశ్యమిప్పటికీ నాకళ్ళకి కట్టినట్లుగా వుంది. అప్పటికి నా చదువింకా పూర్తి కాలేదు.

నాచదువు పూర్తి అయాక, నే నేవుద్యోగ ప్రయత్నమూ చెయ్యలేదు. అంత చేయవలసిన అవస రమూ కలగలేదు; నా కటు దృష్టికూడా పోలేదు. మరెవ్వరూ లేకపోవడాన్ని నే నుద్యోగానికై పైవూరు

వెళ్ళడం అమ్మమ్మ కిష్టంలేకపోవడంకూడా సహజమే. తోటపనులూ, తోటనానుకునేవున్న మా పొలం పనులూ చూసుకుంటూనో, పుస్తకాలు చదువుకుం టూనో కాలం వెళ్ళబుచ్చేవాణ్ణి.

మాగ్రామంలో ఇంగ్లీషు నేర్పేబడి లేకపోవ డాన్ని, చుట్టుపక్కల పిల్లలు కొంతమంది పొద్దున్నే గంటో గంటన్నరో ఇంగ్లీషునేర్చుకోడానికి నావద్ద కొచ్చేవారు. ఇంగ్లీషుతోపాటు, ప్రపంచ విషయాలూ పత్రిక విశేషాలూ కూడా అప్పుడప్పుడు చెప్పేవాణ్ణి. పన్నెండు, పధ్నాలుగేళ్ళలోపువారే ఓపదిమంది వచ్చే వారు. తరుచుగా దేవికూడా వారితో కూర్చొని చదువుకునేది.

గృహబాధ్యతంతా వర్ధనమ్మా, అమ్మమ్మా చూచుకునేవారు; పొలం తోట పనులు చిన్నదాసే చూచుకునేవాడు. స్వంత శేరీ అన్నమాటేకాని, నా కేమంత బాధ్యతే వుండేదికాదు.

చిన్నదాసుడి కుటుంబం, మూడునాలుగు తరాల నుంచీ మా తోటా పొలం, చాలా విశ్వాసంగా చూస్తూవచ్చారు. చిన్నదాసుకి మామీద ప్రత్యేక అభిమానం ఉండడానికి మరో కారణంకూడా వుంది. వాడి కుటుంబానికి ఎప్పటిదో తాతలనాటినుంచీ, ఓ ఎకరన్నర స్వంతభూమి, మా భూమిపక్కనే వుంది. వాడి తండ్రి, పెద్దదాసు ఆ భూమి కూతురు వివాహానికి

కాబోలు తాకట్టుపెట్టి రెండు మూడువందల అప్పు చేశాడు. పెద్దదాసు చనిపోయేటప్పటికి అది పెరిగి నాలుగయిదువందలయింది. అప్పు తీర్చుకోలేకనూ, తాతలనాటిభూమి అన్యాక్రాంతం అవడం ఇష్టం లేకనూ, చిన్నదాసు ఆ భూమిని మమ్మల్నే ఎంతో కొంతకి తీసుకోమని చాలాకోరేడు. ఆ బాకీ మనమే తీర్చి, ఆభూమి చిన్నదాసు కుటుంబానికే మిగిలేలా చూద్దామని అమ్మమ్మతో నేను చెప్పాను. అమ్మమ్మ కూడా అది చిన్నదాసుకుటుంబానికి దక్కకుండా పోవడం ఇష్టంలేక అంగీకరించింది.

అప్పటినుంచీ వాడికి నేనంటే పరమవిశ్వాసం. నాకు పూలమొక్కలంటే సరదాఅని ఎంతో జాగ్రత్తతో చిన్న పూలతోటకూడా మా ఆవరణలోనే వాడువేశాడు. నాకప్పట్లో చలికాలంలోనేకాక అన్ని మాసాల్లోనూ, టొమాటోలు కాపించగలమేమో చూడాలని చాలా సరదా వుండేది. ఆవిషయంలో కూడా చిన్నదాసు ఉత్సాహంతో నాతో సహకరిస్తూండేవాడు.

చెప్పవచ్చేదేమిటంటే, ఏ చింతలూ లేకుండా, నిర్విచారంగా, స్వేచ్ఛాజీవనం నాకు సాగుతూండేది. అందుచేతనే అనుకుంటాను, నాకు వివాహంవేపు మట్టుకు కొద్దిమాత్రమైనా దృష్టి పోలేదు. అమ్మమ్మ ఎన్నిసార్లావిషయం ఎత్తినా నవ్వేసి ఊరుకునేవాణ్ణి.

'నేనున్నంతకాలం పరవాలేదు; తరవాత ఈ దేవి వంటి కోడలొకర్తె ఇంట్లో వుంటేకాని వీడికి జరగదు' అంటూండేది. దేవివంటి కోడలు ఏయింటికైనా లక్ష్మి వంటిదే; సందేహం లేదు, అని త్వరలోనే తెలుసుకున్నాను. కాని అమ్మమ్మ ఉద్దేశమేమిటో నాకు స్పష్టంగా తెలియలేదు; తెలిసినా, అప్పట్లో వివాహం తలంపే నాకు లేదు. నాకప్పుడు యిరవై రెండు, యిరవై మూడేళ్ళుంటాయేమో; దేవికి పధ్నాలుగు పదిహేనేళ్ళుండవచ్చు.

వర్ధనమ్మకూడా, 'వంశానికి ఒక్కడివి. అమ్మమ్మకు నువ్వుతప్ప ఇంకెవరున్నారు? ఆమెమాట కాదనకు. వివాహం త్వరలో చేసుకో' అని చెబుతూండేది. కాని, దేవిసంబంధం సూచించినట్టుగా ఎప్పుడూ మాట్లాడలేదు. బహుశా అది అసంభవమనుకునేదేమో? నే నెరిగినంతవరకు మా వంశంలో కట్నాలప్రసక్తి ఎప్పుడూ లేదు. అమ్మమ్మకుకాని, నాకుకాని, పెద్ద అంతరం, చిన్నఅంతరం అనే భావంకూడా అంతగా లేదు. కాని, నాకు వివాహ ఉద్దేశముంటేకదా, ఏది యుక్తమైన సంబంధమని అనుకోడానికి? ఏమయినా, అమ్మమ్మ సాయంతోనే వర్ధనమ్మ ఓసంబంధం కుదిర్చి దేవికి వివాహంచేసింది. వరుడు దూరప్రాంతాల్లో రైల్వేలో పనిచేస్తున్నాడు. పెళ్ళయాకకూడా వర్ధనమ్మా, దేవీ మాయింట్లోనే వుండేవారు. దేవిమట్టుకు

మునపటంత చనువుగా నాతో మసలేదికాదు. నాకో సారి సుస్తీచేసినప్పుడుమాత్రం ఎప్పటి చనువుతో నాకెంతో బాగా సంరక్షణ చేసింది; దగ్గిరకూర్చుని, పుస్తకాలూ అవీ అందిస్తూండేది. అప్పటినుంచీ, అదేమి ఆశ్చర్యమోకాని, దేవిని నేనెందుకు వివాహమాడ లేదా అనే తలంపు — పాపపు చింతేకావచ్చు — నన్ను పదేపదే కలతపరిచేది. ఆ యోచన, ఎంత వదుల్చుకుందామన్నా, వదిలేదికాదు. ఆమెను మించిన అర్ధాంగి నాకు దొరకదనే విషయం ఆమె కన్యగా వున్నంతకాలం నాకు తట్టిందికాదు. ఇప్పుడాతలంపు నన్ను వేధించ సాగింది. నావివాహ ప్రసక్తి యిక అసంభవమే.

దేవి యిక కాపురానికి వెళ్తుందనగా, ఒకరోజు హఠాత్తుగా టెలిగ్రామ్ వచ్చింది — ఆమె భర్త, రెండు రోజులు సుస్తీపడి అకస్మాత్తుగా మరణించాడని. దేవి కంటేకూడా వర్ధనమ్మ క్రుంగిపోయింది. పూర్వపు ఉల్లాసమూ, సరదా అన్నీపోయి ముసలిదానిలాగా అయిపోయింది. పూర్వం ఎప్పుడూ నవ్వుతూ మాట్లాడే ఆవిడ ఎప్పుడూ కంటతడిపెట్టేది. అమ్మమ్మకూడా చాలా విచారించింది.

ఎరిగున్న పెద్దమనిషి, ఒకాయన, ఉద్యోగం విరమించి పెన్షనుతీసుకుంటూ కాశీలోవుంటున్నాడనీ, వంటకూ, సాయానికీ తగినమనిషికోసం చూస్తున్నాడనీ తెలిసి, ఓరోజువర్ధనమ్మ, అమ్మమ్మతో ఈ సంగతి

చెప్పి, పిల్లతోకూడా కాశీవెళ్ళిపోతానన్నది. అమ్మమ్మ 'ఈ డొచ్చినపిల్లతో దూరదేశాని కెందుకెడతావు? నీ తరువాత దాన్నిచూచే దెవరు? నేనూ పెద్దదాన్నయి పోయాను; మాకూ ఆసరా ఎవరూలేరు. వాడికి బుద్ధిపుడితేకాని పెళ్ళిచేసుకోడు; చెప్పి లాభంలేదు. నే నున్నంతకాలం మీా కేయిబ్బందీ ఉండదు. నా తర వాత వాణ్ణిమాత్రం చూచే దెవరు? భగవంతుని కృప ఉంటే ఎప్పటికైనా ఒకయింటివా డవుతాడు. వాడికీ మీారంటే అభిమానమే. తప్పకుండా మీా కేలోపమూ రాకుండా కనుక్కుంటాడు. దుఃఖించి ఏంలాభం? నాకూ, ఓసారి తీర్థయాత్రలు చేసుకురావాలనే వుంది. అంతాకలిసే వెళ్ళివద్దాం, మనశ్శాంతి కలుగుతుంది. అంతేకాని, ముందూ వెనకా చూడకుండా అలా కాశీ వెళ్ళబోకు' అని ఆదరంతో చెప్పింది. నాకూ, చాలా వేదన కలిగింది.

తరవాత, అందరంకలిసే తీర్థయాత్రలకువెళ్లాం. వర్ధనమ్మా, దేవీ మాతోరావడం, అమ్మమ్మకెంతో సరదాగానూ, సదుపాయంగానూ ఉండింది. తిరిగి వస్తున్నప్పుడు కాశీలోనే, నాలుగురోజులు సుస్తీపడి, అమ్మమ్మ భగవత్సాన్నిధ్యం పొందింది. వర్ధనమ్మా, దేవీచేసిన ఉపచారాలు ఎప్పటికీ మరపురానివి. నేనొక్కణ్ణే వుంటే అమ్మమ్మ కష్టమేమి చేయగలిగే వాణ్ణో? అమ్మమ్మ పోయేముందు ఓరోజున దేవికాళ్ళు

రాస్తూవుంటే, 'ఇటువంటి దొకర్తె తోడుగావుంటే వాడి కేయిబ్బందీ ఉండదు. దీన్నే ఇచ్చి పెళ్లిచేసినా బాగుండేది. నాకు గట్టిగా తట్టకపోయింది. అసలు వాడికి పెళ్ళిప్రసక్తే అక్కర లేకుండా పోయింది. ఇంతకూ వెళ్ళిపోయేదాన్ని నాకెందుకీ చింత? కాని ఎప్పటికేనా బుద్ధిపుట్టి, ఒకయింటివాడై, బాగాజరిగితే అదేచాలు. అంతవరకూమాత్రం వాణ్ణిచూస్తూండండి' అంది. అప రాధంచేసిన వాడిలా నేను మాట్లాడలేకపోయాను.

అల్లుడు పోయినమీదట అమ్మమ్మపోవడం, వర్ధనమ్మకు తట్టుకోలేని ఘాత అనిపించింది. 'ఎంత సుకృతంచేసుకుంటేకాని యిటువంటిమనిషి ఆదరణ పొందగలుగుతాం? ఆమె అదృష్టవంతురాలు; తీర్థ యాత్రలు ముగించి, కాశీలో విశ్వేశ్వరుడి సన్నిధిచేరు కుంది. అంతా కలసివచ్చాం; అటువంటి ఆవిడని పోగొట్టుకొని ఇంటికెట్లావచ్చేది? ఆమె కోరిక యిక నైనా నెరవేర్చి త్వరలో ఒక ఇంటివాడివవు. నేనూ, దేవీ కాశీలోనే ఉండిపోతాం, మీ మేలెప్పటికీ మరిచి పోం' అన్నది, విచారిస్తూ.

"అమ్మమ్మ లేకుండా, మీరూ లేకుండా నే నొక్కణ్ణీ యింటికెట్లా వెళ్లేది? మీరూ నాతోనే వచ్చి మాయింట్లోనే వుండండి. నాకు మరెవరు ఆసరా ఉన్నారు?" అన్నాను.

ఇంటికి తిరిగి వచ్చాక, అమ్మమ్మ లేకపోవడం పెద్ద వెలితే — అది ఎప్పటికి తీరేదికాదు — కాని, వర్ధనమ్మా, దేవీ నా కేలోపమూ లేకుండా చక్కగా చూచేవారు. ఈ ప్రయాణంలో దేవితో నాకు బాగా చనువేర్పడింది. అమ్మమ్మలాగే వర్ధనమ్మకూడా సంధ్యవేళ తులసిమొక్కవద్ద దీపంఉంచి ప్రార్థనకు కూర్చునేది; పక్కనే దేవి కూర్చునేది. నేనుకూడా చిన్నప్పటిలాగా, గాలికాడుతున్న దీపం చూస్తూ, నిశ్శబ్దంగా కూర్చునేవాణ్ణి.

'దేవివంటి కోడలొక్క ర్తె వుంటేకాని, నా తరువాత వీడికెలా జరుగుతుంది?' అని అమ్మమ్మ అన్న మాటలు ఎప్పుడూ నా చెవుల్లో వినిపించసాగేవి. చిన్నతనం చేతనో, బాగా గడుస్తూండడాన్ని బాధ్యత ఎరగకనో, ప్రపంచజ్ఞానం లేకనో, అమ్మమ్మ జీవించి ఉండినంతకాలం, దేవి అవివాహితురాలుగా ఉండినంతకాలం, నా అదృష్టదేవత ఎవరో నేను తెలుసుకోలేకపోయాను. పొరపాటు చేశాననే ఈ చింతతప్ప, ఇతరత్రా నా జీవితం ప్రశాంతంగా, స్వేచ్ఛగానే గడుస్తూండేది.

అయితే, రోజులెప్పుడూ ఒక్కలాగెందుకుంటవి? జీవిత మెప్పుడూ నెమ్మదిగా ఎందుకుంటుంది? దేవి యుక్తవయస్కురాలై బాగా ఎదిగినపిల్ల, నిజమే;

చాలాకాలంనుంచీ ఎరిగివున్న వాళ్ళమూ, కలిసిఉన్న వాళ్లమూ అవడంచేత, మా ఇద్దరికీ చనువున్న మాట కూడా వాస్తవమే. చూస్తూండగానే గ్రామంలో వదంతులు లేచిపోయినాయి; గోడలమీదకూడా నాపేరూ, దేవిపేరూ అసహ్యమైన సంగతులతో రాశారు. దేవి గర్భవతిఅనే అపవాదుకూడా బయలుదేరింది.

బుద్ధిమార్దవంలేని నలుగురూ అనుకునే అపవాదుల కంత లక్ష్యము చేయవలసిన అవసరం నాకు లేదు కాని, యివి చెవినిపడితే వర్ధనమ్మా, దేవీవాళ్ళ మనసులెంత చిన్నపుచ్చుకుంటారో, ఎంత బాధపడతారో అనిమటుకూ చాలా విచారపడ్డాను. దేవితో చనువుగా వుండడం తగ్గించగలను కాని, అపవాదు రాకుండానూ, వాళ్ళ చెవిలో పడకుండానూ నే నెట్లా ఆపగలను? ఉన్న మార్గమల్లా వాళ్ళని వేరే ఉండమని చెప్పి, వారికి చెయ్యగలిగిన సాయమేదో చెయ్యడమే. కాని, వాళ్ళని యింట్లోనుంచి వెళ్ళిపోవడం మంచిదని చెప్పడానికి నాకు నోరురాలేదు. అందులో నా స్వార్థం కూడా ఉందేమో? అమ్మమ్మా లేకుండా, వీరూ లేకుండా అసలాఇంట్లో నే నొక్కణ్ణే ఎట్లా ఉండగలను?

వర్ధనమ్మ ఏమనుకున్నదోకాని, దేవి నాతో ఎప్పట్లాగా చనువుగా ఉండడం మానేసింది. ఈ కలతలకూ, అపవాదులకూ నేనేకదా కారణం? సకాలంలో,

నా పరిస్థితుల కనుగుణంగా, నేను చేయవలసినది గుర్తించలేకపోయాను. ఎదురుగుండా గృహిణిని గ్రహించలేకపోయాను. ఏకాలంలో లత గాఢంగా వృక్షాన్ని అల్లుకుంటూ, వృక్షానికి శోభనిచ్చి తాను కూడా రాణిస్తుందో అటువంటి సమయంలోనేకదా మానవహృదయాలుకూడా అన్యోన్యంగా పెనవేసుకునే అవకాశమిస్తేనే రాణిస్తవి? ఆ జ్ఞానం నాకు తీరా చేయిదాటాక, ఆలస్యంగా వచ్చింది.

ఒకరోజురాత్రి భోజనాలయాక, వర్ధనమ్మ మేడ మీద నాగదిలోకివచ్చి, నావద్దకూర్చొని, 'మీ అమ్మమ్మ కన్నతల్లికంటె ఎచ్చుగా చూసింది; నువ్వూ కూడా కొడుకుకంటే ఎచ్చుగా చూస్తున్నావు. కాని మా దురదృష్టాని కేవరేమి చేయగలరు? నువ్వూ పెళ్ళి త్వరలోచేసుకో; మేంమటుకూ ఇక ఎక్కడికేనా వెళ్ళిపోతాం' అని కంటతడిపెడుతూ అంది.

అప్పటికే నేనొక నిశ్చయానికి వచ్చాను. అందుచేత ఈమాటలూ ఆమాటలూ చెబుతూ మెల్లగా వితంతు వివాహాలగురించీ, ఇప్పటి సంఘ సంస్కారాలగురించీ ప్రస్తావనలోకి తెచ్చాను. ఆమధ్య జరిగిన ఒకటిరెండు వితంతువివాహాల నుదహరించాను. ఆవిడ అట్టే ఉత్సాహం కనపర్చకపోయినా, బొత్తిగా అసమ్మతి చూపకపోవడం గ్రహించి అసలు విషయాని

కొచ్చి, దేవికీ నాకూ అన్యోన్యత ఉన్నదనీ, ఆమె ఒప్పుకుంటే మా వివాహానికి మరేఅభ్యంతరమూ లేదనీ, పెళ్ళివిషయమై గ్రామంలో ఏమేనా అపవాదువచ్చినా, యిప్పుడున్న అపవాదు కంటే ఎచ్చేమీ కాదనీ, అనేశాను. అప్పట్లో, ముఖ్యంగా గ్రామప్రాంతాల్లో, వితంతువివాహాలనింకా యిప్పటంత నిరాటంకంగా ఆమోదించడం లేదు.

వర్ధనమ్మ మొదట నిర్ఘాంతపోయింది. కాస్త తేరుకున్నాక, 'ఏం నాయనా, వంశాని కొక్కడవు. నువ్విట్లాంటి విషయం తలపెట్టవచ్చునా, అమ్మమ్మ వుంటే ఏమనేది? తప్పు కాదుబాబూ' అంది. కాని, కొంచెంసేపట్లోనే ఆవిడకి నా ఉద్దేశం కాస్త ఆనందమో, తృప్తో కలిగింపకపోలేదని గ్రహించాను.

దేవికీ నాకూ వివాహమయాక, జీవితం ప్రశాంతమైన సుఖస్వప్నంలా గడిచింది. చిన్నప్పుడు రాత్రి ఫలహారమయాక అమ్మమ్మకు దేవి కాళ్ళుపడుతూంటే 'చాల్లే అమ్మాయ్; వాడికి పాలుతీసుకు వెళ్ళిరా' అనేది. అలాగే వాళ్లమ్మకు దేవి కాళ్ళు పడుతూంటే వర్ధనమ్మ కూడా 'చాల్లే, బాబుకి పాలు తీసుకువెళ్లు' అనేది. మాకువివాహమయిన రెండుసంవత్సరాల్లోగానే వర్ధనమ్మ చనిపోయింది. ఆమె నిర్విచారంగానే వెళ్ళిపోయింది. అప్పుడు దేవి గర్భవతి.

మాసాలు నిండుతూన్నప్పుడు ఎప్పుడూ నన్ను దగ్గిర కూర్చోమనేది. ఎంత నెమ్మదైన పిల్ల! వట్టి అమాయకపు అమ్మాయి. 'నీ కేంకావాలో ఎప్పుడూ ఏమీ అడగవేం?' అని యిక్కడే ఈ మంచంమీదే కూర్చొని దేవిని ఎప్పుడేనా అడిగేవాణ్ణి. దేవి నవ్వేది. 'చెప్పుమరి; చీరెలు కావాలా, గాజులు కావాలా; పళ్ళేమేనా తెచ్చీదా? నువ్వేదేనా అడిగితే, తెచ్చి ఇస్తేకదా నాకు తృప్తిగా వుంటుంది?' అనేవాణ్ణి.

'నేనడక్కుండానే అన్నీ తెచ్చి ఇస్తూంటే, మరి అడగడం ఎలా?' అనేది, ప్రసన్నవదనంతో.

వర్ధనమ్మపోయిన ఆరుమాసాలకే కాన్పువచ్చి దేవీ, బిడ్డాకూడా నన్నువిడిచిపెట్టి అనంతాకాశంలో లీనమైపోయారు. ఆమెవంటి స్త్రీఆదరణా స్నేహ లాలిత్యమూ పొందిన నాఅంతటి అదృష్టవంతులూ ఉండరు; అంతత్వరలోనే అటువంటిభాగ్యం పోగొట్టు కొన్న, నాఅంతటి అదృష్టహీనులూ బహుశావుండరు. అంతులేని అమృతమయమైన స్నేహమూ, అను రాగమూ, ఆదరణా కొందరుస్త్రీలలో భగవంతుడు సృష్టిస్తాడు. వారి నాదరించేవారున్నా లేకపోయినా ఆదరణచూపడమే వారి స్వభావం. అట్టివారి ఆద రణ, పూర్తిగా చిరకాలంపొంది, సఫలీకృతంఅయ్యే అవకాశమివ్వకుండా విధాత ఎందుకుచేస్తాడో నాకు బోధపడదు.

అందర్నీ పోగొట్టుకొన్న తరవాతనే, తీర్థయాత్రలకు బయలుదేరాను. పనీ, ఆర్జనా అంటూ లేకుండా, ఏ ప్రత్యేకోద్దేశమూ లేక అట్లా దేశాటనంచెయ్యడం యుక్తమో కాదో నేనుచెప్పలేను. ఒకప్పుడు యుక్తం కాదేమోనని భావించినవాణ్ణే. కాని, ఏదో ఒక స్నేహానుబంధముంటేతప్ప, జీవితంలో ఆసక్తి ఎలా గుంటుంది? ఆసక్తీ నశించి, పరిపక్వమైన వైరాగ్యమూ నిశ్చలమైన పారమార్థికచింతా కుదరనంతవరకు, ఏం చేయాలి? తీర్థయాత్రలు చేసుకుంటూ ఏ సాధుపుంగవుల సాంగత్యంలోనో మనశ్శాంతేనా పొందాలికదా? సాధువుల్లోనూ అన్నిరకాలవారూ ఉంటారు; నిజమే. ప్రశాంతచిత్తులైన మహనీయులూ ఉంటారు. ఒక్కొక జీవితంలో ఒక్కొక్కప్పుడు కొన్ని ప్రత్యేక పరిస్థితులనుబట్టి అన్నీవిడిచి, యాచిస్తూనో, యాచించకనో తీర్థయాత్రలు చెయ్యడమే శరణ్యమవుతుంది.

సరే; పనిచేసుకు పోషించుకోగలిగినంతవరకు పోషించుకున్నాను; యాచించవలసి వచ్చినప్పుడు యాచించానుకూడా. యాచించవలసివస్తేకాని, ఒకప్పుడు అహం బాగా నశించదు. ఏమయినా, ఇంటివేపుమటుకూ దృష్టిపోనివ్వలేదు. ఇల్లంటూఉంటే కదా దృష్టిపోడానికైనా? ఏమేమిచేశానో, ఎక్కడెక్కడ తిరిగానోచెప్పి విసిగించడమెందుకు?

మళ్ళీగాలి ఒక్కసారి రివ్వున వీచింది. చమురు దీపం నాట్యంచేసింది. వెనకటి ప్రశాంత మధుర దృశ్యాలు అనేకం హృదయంలో లీలగా ఆడాయి. ఇల్లంటూ లేక, అన్ని ఆశలూ అంతమయాయనుకున్న నేను మళ్ళీ ఎన్నాళ్ళ కిక్కడికే వచ్చాను! ఎందుకీ చిత్రసంఘటన జరిగింది? వెనకటి సంగతులు గుర్తు కొచ్చి వేసనపడేందుకా? వెళ్ళిపోయిన మంచిరోజు లకు దినదినమూ ఎంతదూరమౌతున్నానో గ్రహించ డానికా? మళ్ళీ అటువంటి రోజులు వస్తాయా?

నిర్మలాకాశంలో ప్రశాంత శీతలవాయువు వీస్తూనేవుంది. కిటికీలోంచి చూస్తూంటే, నన్ను విడిచి వెళ్ళినవారంతా నక్షత్రాలై వెలుగుతున్నారా అనే ఊహతట్టింది. చటాలున నెమ్మదిగావచ్చి, మంచి నీళ్ళపాత్రనుంచి, మరి 'వెళ్ళకండి' అన్న మాలతి గుర్తు కొచ్చింది. అదేమి ఆశ్చర్యమో, దేవే ఆమెరూపంలో వచ్చిందా, అనిపించింది. బొమ్మకూడా అమ్మమ్మే అనిపించింది.

మళ్ళీ ఎప్పటిముగ్గురం! వెనకటి నాలుగైదు సంవత్సరాల జీవనం ఒక్కసారి తుడిచిపెట్టుకుపోయి, పూర్వపు ప్రశాంత మధురజీవనంలో మేలుకున్న ట్లనిపిం చింది. పునర్జీవితంది కావచ్చు; వెనకటి జీవనంది కావచ్చు; ఏదో నూతన జీవితపుకాంతిమటుకూ ద్యోతకమయింది.

ఎవరో నెమ్మదిగా అంటున్నట్టనిపించింది. 'అయిపోయిన మంచిరోజులకు దూరమవుతున్నామని అనుకోవడ మెందుకు? ముందున్న మంచిరోజులు దగ్గర పడకూడదా?' ఎవరన్నా రీమాటలు! దేవిదా, మాలతిదా ఆతీయని స్వనం?

దీపంజ్వాలా, గోడమీదనీడా కూడా నా హృదయంలోని విస్మయపూరిత భావనలాగే, గాలితో కలిసి రమణీయంగా నాట్యంచేశాయి. భగ్నమయి పోయిందనుకున్న నా జీవితంలో, ఆశా, ఆసక్తీ, ఉత్సాహమూ మళ్లీ చిగిరించడాని కీరోజేకదా ప్రారంభ మనుకున్నాను.



# తగాదా

మూడురోజులనుంచీ జరుగుతోంది, మా అద్దె ఇంట్లో రెండో భాగంలో ఉంటున్న భార్యాభర్తలకి.

అసలాయింట్లో ఒక కుటుంబం ఉండేందుకే అన్ని సౌకర్యాలూ లేకపోయినా, యింటి యజమాని — మహానుభావుడు — ఈ ఊళ్లో అద్దెయిళ్లు తక్కువవటం చేత ఉపకారబుద్ధితోనేసుమండీ — ఇల్లు రెండుభాగాలుగా చేసి అద్దెకిచ్చేడు. రెండుభాగాలన్న మాటేగాని, నీళ్ళగది, దొడ్డి, నడిచావడి సమిష్టిగానే ఉంటాయి. పడకటింట్లోకూడా ఒకరి ముచ్చట్లు — ముచ్చట్లంటే, మనలోమాట, చాలామటుకూ చిల్లర తగాదాలే — ఇంకొకరు కుతూహలంతో, జాగ్రత్తగా వినప్రయత్నించకుండానే వినిపిస్తూ ఉంటాయి!

మా ఆవిడ పుట్టింటికి వెళ్ళడంచేత, చాలా రోజులనుంచీ చదువుదామనుకుంటున్న కొత్తనవలని గ్రంథాలయంనుంచి తీసుకొచ్చి, తీరికగా చదువుదామని రాత్రి తియ్యడమే కాని — అంతకుముందే ప్రారంభించే వారు పక్కభాగంలో అద్దెకున్న దంపతులు తలగడాల ప్రస్తావన. సంగతేమిటంటే : వాళ్లావిడ పుట్టింటినుంచి కొంచెం బూరుగుదూది పట్టుకువచ్చిందట. దానితోనే ప్రత్యేకం కొన్ని కొత్తతలగడాలు కుట్టిస్తే బాగుం

టుందో, లేక పాతతలగడాల్లో దూదికూడా తీసేసి అంతదూదీ కలిపి ఏకించి కొత్తగా తలగడాలు కుట్టిస్తే బాగుంటుందో, తలగడాలకు ఎటువంటిగుడ్డ బాగుంటుందో — యిత్యాది విషయాలన్నీ చర్చజరుగుతూ వచ్చింది. ఆయనంటూరుకదా :

"పాతదీ, కొత్తదీ అంతదూదీ ఏకించేసి ఎన్ని తలగడాలకి సరిపోతే అన్ని కొత్తవి కుట్టించేద్దాం. మళ్లీ మళ్ళీ ఏమిటి ?"

"మళ్ళీ మళ్ళీ ఏమిటండీ; ఉన్న తలగడా లలా ఉండనీయండి. రెండు కొత్తవి కుట్టిద్దాం. మిగిలినదూది అలా అటకమీద ఉంచేద్దాం."

"రెండుతలగడా లేం సరిపోతాయి ? నీకు రెండు, నాకు రెండేనా ఉండొద్దా ?"

"మరి పాతవి ఉన్నాయికదుటండీ ?"

"అవున్లే. అవి గట్టిగా అట్టలు కట్టిపోయినట్టున్నాయి. పనికివస్తే ఆదూదికూడా ఏకించేసి, అన్నీ కొత్తవికుట్టిస్తే మెత్తగావుంటాయి. మళ్ళీ గట్టితలగడాలెందుకు మెత్తవాటితో కూడాను ?"

ఇక్కడ సంభాషణఆగి, ఏదో వింతభాష మొదలైంది; నాకు బోధపడినంతవరకూ ఇలావుంది: "డూల్ బిలీ, డూబుల్ బిలీ, జలిబిలిబిలీ..." ఆశ్చర్యపోయాను! ఇంతలోనే, వాళ్ళ రెండేళ్ళపాప ముదు

మాటలు వినిపించాయి. అప్పుడు బోధపడింది, పాపను ఆయన ముద్దులాడుతున్నాడనీ!

'కూసు బాబులూ, కూచులు బాబులూ!' అని ఒకమారూ, 'సినీమాస్టార్! గరమ్ మిఠేప్యార్! దునియాకే రాణీ!' అని ఒకమారూ, అనేకవిధాలుగా మధ్యమధ్యని ముద్దులాడడం సాగుతూనేవుంది. వాళ్ళ పాప మగబిడ్డ. అందుచేత 'సినిమాస్టార్! దునియాకే రాణీ!' అని పాపని ముద్దులాడుతున్నాడో, భార్యని ముద్దులాడుతున్నాడో బోధపడిందికాదు; లేక పాప నోమారూ, భార్యనోమారూ, ముద్దులాడుతున్నాడో, ఇద్దర్నీ కలిపి ఒక్కసారే ముచ్చట్లాడుతున్నాడోమరి!

ఒకందుకు విస్తుపోయాను: ఆయన ఏ ఆఫీసు లోనో గుమాస్తాగా ఉంటున్నాడు. ముప్పైఆరు ముప్పై ఏడేళ్లు దాటి వుండవు కాని, చాలా అనుభవంవున్న పెద్దమనిషిలా వుంటాడు. అధిక ప్రసంగం చెయ్యడు. ఏవిధమైన వెకిలిచేష్టలూ ఆయనలో ఊహించడం కష్టం. అసలు తేలికసరదాలన్నా, శృంగారచేష్ట లన్నా మొహం చిట్లిస్తాడేమో ననిపిస్తుంది. సరిగ్గా తొమ్మిదీ నలభై కల్లా సైకిలుమీద కాఫీఫ్లాస్కుసంచీతో సహా, ఆఫీసుకుపోయి సాయంకాలం అయిదూఇరవై కల్లా కూరగాయలేమేనా సంచీలో వేసుకుని యింటికి వచ్చేసేవాడు. ఆ సంచీలోనే అప్పుడప్పుడు భార్యకో మిఠాయిపొట్లమో, పువ్వులగుత్తో, పాపకి ఆటవస్తువో

కూడా తెస్తూంటాడేమో మరి! సంచీ తిన్నగా ఇంట్లోకే తీసుకువెళ్ళేవాడుకాని, పైని ఎప్పుడూ అందులోని సామాన్లు తీసేవాడుకాదు. అందుచేతనే వంట సామగ్రిమాత్రమే తెచ్చేవాడో, లేక భార్యకి సెంటు బుడ్లూ, సబ్బులూ, వాసననూనెలూ వంటివికూడా తెస్తూండేవాడో నాకెప్పుడూ తెలియలేదు. ఆయనా, ఆయనభార్యా పొత్తుగానే ఉండేవారనుకుంటాను. కేకలేసుకోవడం ఎప్పుడూలేదు. సంసారంకూడా పొందికైనదిలాగే వుంది.

ఎప్పుడేనా, సెలవురోజున, ఆయన తెప్పించే పత్రిక నాకిచ్చి, నేను తెప్పించే రెండోపత్రికను కాస్త ఇమ్మనేవాడు. అంతకుమించి, ఆయన చేబదులు అడగడంకాని, ఆయనభార్య కాఫీగుండ, పంచదార వంటి పదార్థాలు ఇరుగుపొరుగువారిని అప్పుఅడగడంగాని, ఎప్పుడూ జరగలేదు. ఆయనకు నూటపదో, నూటపాతికో జీతమనుకుంటాను. అనవసర వ్యసనాలు కాని, దర్జాలకి పోవడంకాని దంపతులిద్దరికీ లేవు. అందుచేతే అనుకుంటాను, చాలాయిమ్మగా జరుపుకొంస్తున్నారు సంసారాన్ని.

లేకలేక కలిగినట్టుంది వాళ్ళకాబిడ్డ. దంపతులిద్దరికీ పాపంటే ప్రాణంలాఉండడం సహజమే; కాని ఆయన భార్యతో లాలనగా ఉంటాడనిగాని, బిడ్డను అంతలా అతిగా ముద్దులాడుతాడనిగాని, ఆయన

తీరనుపట్టి, ఇంతవరకూ నే నూహించలేక పోయాను. భార్యను తీసుకువెళ్లకుండా ఆయనొక్కడూ సినీమాకి వెళ్ళేవాడు కాదు. నిజమే. అయినా, పదిహేనేళ్లై గుమాస్తాపని చేస్తున్నవారికింత స్వారస్యం ఉంటుందని ఎవరనుకోగలరు? బూరుగుదూదితో తలగడాలు కుట్టించడంలాంటి స్వల్పవిషయంలో ఇంత శృంగారాని కవకాశం ఉంటుందని ఎవ రూహించగలరు? అట్లాంటిసమర్థత బహుశా గుమాస్తాలకీ, బడిపంతుళ్ళకే చెల్లింది కాబోలు!

ముద్దులాడడం ఆగినట్టుంది; మళ్ళీ సంభాషణ మొదలైంది. ఆవిడ అన్నదికదా:

"పోనీ, గట్టితలగడాలు మీ రొకటీ నే నొకటీ తీసుకుందాం. మెత్త తలగడాలకిందో, కాళ్ల కిందో వేసుకోవచ్చు."

"పోనిస్తూ; ఇంతకీ ఏమంత ఖర్చవుతుందని? నీ కా దూదీ, ఇదీ కలపడం ఇష్టం లేకపోతే మీ పుట్టింటిదూది వేరే ఏకించి దానితో నీకు వేరే కుట్టించుకోవచ్చున్లే."

"సరిపోయింది! కలపడాని క్కాదండీ; పుట్టింటి దూదీ పక్కింటిదూదీ ఏమిటి! మరీ, అన్ని తలగడా లేంచేసుకుంటామనీ?"

"ఎవ రేనావస్తే వాడడానికుంటాయ్. రేపొ

ద్దున్న, భగవంతుడు మేలుచేసి, మహో బిడ్డపుడితే ఉయ్యాల్లో వెయ్యొచ్చు!"

ఈ మాటలని, తప్పకుండా భార్యబుగ్గమీద తేలికగా చిన్నచిటికవేసి వుంటాడు; ఆవిడగారి ముఖం కూడా వాళ్ళ పుట్టింటిబూరుగుదూదిలాగా విప్పారి ఉంటుంది! సందేహం లేదు. కాని, ఈవిడకి మళ్ళీ కాన్పుందేమిటి చెప్మా? నా భార్యవస్తే కనుక్కోవాలి అనుకున్నాను.

మళ్ళీ ఆవిడ మొదలెట్టింది:

"చంటిపిల్లల కుయ్యాలలో వెయ్యడానికైతే చిన్నవి కుట్టించాలికాని, ఇంత పెద్దవెందుకూ? ఎవరో, ఎప్పుడో తలగడా తెచ్చుకోకుండావస్తారని ఇప్పణ్ణుంచీ ఎక్కడకుట్టిస్తాం? పోనిస్తురూ."

ఇదేధోరణి; మూడు రోజుల బట్టీ ప్రతి రాత్రీ జరుగుతోంది. విస్తారం చెప్పడమెందుకు? అంతా చెప్తే మూడురాత్రులు చదివేగ్రంథమవుతుంది! ఎన్ని తలగడాలు కుట్టించడమో ఇప్పటికి తేలలేదు. అసలు పాతతలగడాలు విప్పించడమో లేదోకూడా తేలలేదు. ఇవి తేలాక, తలగడాలకు చెక్కగుడ్డ వెయ్యడమో, గళ్ళగుడ్డ వెయ్యడమో; గలీబులకు తేలికరంగుగుడ్డ బాగుంటుందో, తెల్లదే బాగుంటుందో వగైరా విషయాలగురించి ఇంకా ఎన్నిరోజుల ప్రస్తావన జరుగుతుందో అని భయపడ్డాను. ఈ చిల్లర

తగాదా మిషతో ఇన్ని రాత్రులు, ఇంతరసికత్వం బూరుగుదూదినుంచి తీయగలిగిన ఈ గుమాస్తా అసాధ్యుడే! వాళ్ళకేం, మధ్యమధ్యని పాపని ముద్దులాడుకుంటూ, బాగానే ఊసుపోతూంది కాంసు. కాని మూడురాత్రు లిదేవరసనిసాగడం నాకిక విసుగ్గానే ఉంది. ఎన్నాళ్లని ఈ బూరుగుదూది భాగవతం?

నా భార్య మా ఇద్దరు బిడ్డల్నీ, ఆరేళ్ళదాన్నీ, మూడేళ్ళవాణ్ణీ, కూడాతీసుకువెళ్ళింది. ఈనవల చదవడంమాట దేముడెరుగును, మా ఆవిడఉన్నా తీరిపోననుకున్నాను. అనుకున్నట్టుగానే, మాఆవిడ అదృష్టవశాత్తు రెండురోజులు ముందుగానే తిరిగివచ్చేసింది. ఈమూరు చదవవచ్చునని నవల గ్రంథాలయంలో ఇచ్చేశాను.

రాత్రి ఖబుర్ల ప్రసంగంలో మాఆవిడకి తెలియజేశాను — మూడురోజుల్నుంచీ ప్రతీరాత్రీ తలగడాల గురించి జరుగుతూన్న ప్రస్తావన. అంతావిని అంది కదా మా ఆవిడ, 'మనంకూడా కుట్టిద్దామండీ' అని!

'ఇప్పు డెందుకు తలగడాలు?' అని వాదనకు దిగేమూ, పొదుగుభాగపు దంపతులకు, మూడు నాలుగు రాత్రులు, తగినశాస్తి అవునుగాని, 'అపకారికి నుపకారము' అనే పెద్దల హితవచనాన్ని జ్ఞప్తికి తెచ్చుకొని, 'సరే' అన్నాను.

*

# శ్రీరాధికా చరణములు

వచ్చినపని పూర్తికాగానే మరి ఆలస్యంచేయకుండా శాశనపూర్‌నుంచి మా గ్రామానికి బయలుదేరడానికే నిశ్చయించాను. ఇక్కడనుంచి అడ్డదారిని పోయినా, మోటారుబస్సు వెళ్ళే రస్తా చేరడానికి, మూడుమైళ్లు వెళ్లవలసి వుంటుంది. అక్కడనుంచి అరమైలు దిగువకుపోతే బస్సు ఆగే స్థలం. సరిగా వేళకు వస్తే, బస్సు సాయంకాలం ఆరుగంటలలోపుగానే రాణీగాంవ్ మఱ్ఱిచెట్టు చేరాలి. బస్సు ఆగే ఈ మఱ్ఱిచెట్టువద్దనుంచే రాణీగాంవ్‌కు నాటుబాట వున్నది. రాణీగాంవ్ హద్దు ఈ చెట్టువరకూవున్నా సుమారు క్రోసుదూరంలో వుంటుంది గ్రామం.

నేను బాగా వేళవుండగానే, నాతో తెచ్చిన చిన్నసంచీ, చేతికఱ్ఱా పట్టుకుని బయలుదేరాను. సగం దూరం వచ్చేటప్పటికి మేఘాలు క్రమక్రమంగా ఆకాశమంతటా అల్లుకోసాగినవి. చల్లని సీటిగాలికూడా వేయనారంభించింది. తోవలో వర్షం ప్రారంభిస్తే చాలా చిక్కుపడ వలసివస్తుందని తొందరగా నడవసాగాను. గాలి అంత కంతకు ఎక్కువ అయింది. నేనుకూడా నడకవడి హెచ్చిస్తూ పోసాగాను. గాలిజోరుకి మేఘాలు చెదరిపోతవనుకున్నాను. కాని నేను రస్తాచేరి రాణీగాంవ్

మర్రిచెట్టు వైపుగా కొంతదూరం పోయేసరికి ఆకాశం పూర్తిగా మేఘావృతమయి ఉరుములు, మెరుపులు తీవ్రరూపం దాల్చ మొదలుపెట్టినవి. నేను మర్రిచెట్టును సమీపిస్తుండగానే చినుకులుకూడా ప్రారంభించినవి.

వటవృక్షంక్రింద కుటీరంలో వెలిసిపోయిన పాతశాలువ కప్పుకున్న టీ దుకాణదారు నన్ను చూచి లోనికాహ్వానిస్తూ 'తోవలో చిక్కుపడిపోయేవారే; చూచారా! ఎవ్వరూ ఇవాళ బస్సుకోసం రాలేదు. ఈ మేఘాల్ని చూచి వచ్చేవారుకూడా మానుకుని ఉంటారు!' అని అంటూ ఉండగానే నేను దుకాణం లోకి చేరి అక్కడవున్న చిన్నబల్లమీద నా సంచీ ఉంచి కూర్చున్నాను.

అప్పటికప్పుడే వర్షం జోరుగా కురవనారంభించింది. దుకాణదారు, నిత్యగోసాయి, టీ తయారు చేయడం మొదలుపెట్టాడు. ఈదారిని నేనెప్పుడు వెళ్ళినా ఇక్కడ టీ తాగకుండా వెళ్ళనని గోసాయికి తెలుసును. ఈ రస్తా, బస్సుమార్గమయిన దగ్గరనుంచీ, నిత్యగోసాయికీ అతని టీ దుకాణానికీ నేను పరిచితుడనే.

ప్రయాణీకు లంతగా ఉండని ప్రాంత మవడంచేత ఈ దుకాణంతోపాటు ఇంతవరకూ మరేదుకాణాలూ ఇక్కడ పెరగలేదు. ఈ మార్గంలో ప్రయాణం చేసేవా రందరికి నిత్యగోసాయి టీ అంటే చాలాప్రీతి!

గోసాయి తెచ్చిన పదార్థాలూ, టీ సేవించి, తీరికగా పాన్ వేసుకోసాగాను. నిత్యగోసాయికూడా పాన్ నములుతూ, 'వర్షమంతకంతకూ హెచ్చవుతూ ఉన్నది, బాబూ. బస్సు వస్తుందని తోచదు. అసలు బయలు దేరిందో, లేక తోవలో ఆగిపోయిందో! అటు మేఘం మరీ దట్టంగా ఉన్నది!' అన్నాడు. ఏమి చేయడానికీ తోచక, 'అయితే ఈరాత్రి కేమిటిచేయడం?' అని ప్రశ్నార్థకంగా నిత్యగోసాయి వేపు చూచాను.

''ఇంత వర్షంలో ఏమిచేయగలం? నేనైనా ఈరాత్రికి మరి రాణీగాంవ్ వెళ్ళలేను. వర్షం ఇలాగే ఉంటే మీరుకూడా ఇక్కడే ఏలాగో కాలక్షేపం చెయ్యాలి. చూచారా! పిట్టమనిషైనా రస్తామీద సంచారంలేదు' అన్నాడు. కుటీరం చిన్న పర్ణశాల అయినా, వటవృక్షంమాటున ఉండడాన్ని ధారాపాతంగా వర్షం కురుస్తున్నా, ఏమిన్నీ ఇబ్బంది కలగలేదు. కాని, నాకక్కడ రాత్రి గడపడానికంత మనస్కరించ లేదు.

నేనేమీ జవాబు చెప్పకుండా ఆలోచనలో పడడంచూచి, 'దిగులేమీ ఇక్కడ ఉండదుబాబూ! ఏవిధమైన ప్రమాదమున్నూ లేదు' అని ధైర్యం చెప్పసాగాడు నిత్యగోసాయి. అప్పటికప్పుడే సూర్యాస్తమయవేళ కావచ్చింది. బస్సురావడ మిక అసంభవమే

అయినా, వస్తుందేమో అనే ఆశ నన్నింకా పూర్తిగా వదలిపోలేదు. బస్సు వచ్చేవేపే ఉత్తరంగా అప్పు డప్పుడు చూడసాగాను. నిత్యగోసాయికూడా కొంత సేపు చూచి పెదవి విరిచి లాభం లేదన్నట్టుగా తల ఊపాడు. నేనుకూడా గోసాయి నుద్దేశించి నవ్వుతూ, 'ఈరాత్రి కిక్కడే మరి!' అన్నాను.

గోసాయి, ఉత్కళ గీతాలు పాడుకుంటూ, వర్షపుజల్లు రాకుండా బల్లతలుపులు బిగించివచ్చి శాలువ తలమీదుగా లాగి కప్పుకొని పాన్ నములుతూ కూర్చొని, రాణీగాంవ్ సంగతులూ, శాసనపూర్ సంగతులూ, ఏవో చెప్పసాగాడు. నేనుకూడా మా గ్రామం సంగతులూ, అవీ ఇవీ మాట్లాడసాగాను. ప్రసంగవశాత్తూ, హరిపల్లి నృత్యగోపాల ఉత్సవాల గురించి ప్రస్తావనరాగా, 'ఆ ఉత్సవాలకు ఎప్పుడేనా వెళ్ళారా?' అని ప్రశ్నించాడు నిత్యగోసాయి.

'ఈ ఉత్సవాలగురించి విన్నాను. చాలా మనోహరంగా ఉంటవనీ, హరిసంకీర్తనం అక్కడ జరిగేటంత తన్మయపులకితంగా మరి ఎక్కడా చూడబోమనీ కూడా విన్నాను, కాని వెళ్ళడం జరగలేదు. నాకున్నూ చాలా వెళ్ళాలెననే ఉన్నది,' అనిచెప్పి ఉత్సవపుసంగతులు వినకుతూహలం చూపాను. నే నిదివరకు వినని సంగతులుకూడా చాలా తెలుసు కున్నాను.

'ఉత్సవాలంటే సామాన్య ఉత్సవాలు కావు బాబూ! ఏమి హరిసంకీర్తనం! గోపాలకృష్ణ భజన గీతాలు వినాలంటే నృత్యగోపాల ఉత్సవాలలోనే వినాలి; గీతగోవిందం వినాలంటే వ్రజరాణీ మేళం నుంచే వినాలి; రాధాకాంత గీతావళి వినాలంటే భంజదేవమేళంనుంచే వినాలి. ఈ చుట్టుపట్ల పధ్నాలుగు వైష్ణవఅగ్రహారాలనుంచి మేళతాళాలతో గోసాయిలూ, వైష్ణవ భక్తులూ హరిపల్లివస్తారు. శ్రీ గౌరహరి మందిరమున్నది హరిపల్లిలోనే. ఉత్సవారంభం హరిపల్లెలోనైనా, మూడురాత్రులూ ఉత్సవాలు హరిపల్లెకుత్తరంగా సుమారు మైలుదూరంలో కేళీవనమధ్యవున్న గోపల్లె అనే కుగ్రామంలోనే జరుగుతవి. వచ్చే యాత్రికులంతా గోపల్లె విహారంలోనే ఉంటారు.

ఫల్గుణమాసం వెన్నెలరాత్రుల్లో ఉత్సవం జరుగుతుంది గనక, మరేవసతులూ లేకపోయినా అట్టే ఇబ్బంది ఉండదు. యాత్రికులందరికీ అక్కడి మఠాధికారులే ప్రసాదం ఏర్పాటుచేస్తారు. ఎవరిమటుకువారు వంటలు చేసుకునేవారున్నా, చాలమంది ప్రసాదమే భుజిస్తారు. ప్రసాదమేమిటి — అమృతవిందు కదా! గోపల్లెలో ఒక ప్రసిద్ధమైన విశేషముంది.

శ్రీ రాధాదేవి చరణాలు వెలిసిన క్షేత్రమిది బాబూ? ఇక్కడ ఒకచిత్రమైన కథ చెబుతారు.

ఇప్పటి హరిపల్లెలో శ్రీకృష్ణప్రభువు క్రీడావినోదంగా సంచరించేవారనీ, తన నిత్యానుచరి రాధికను ఇప్పటి గోపల్లె కేళీవనంలో ఫాల్గుణ పౌర్ణమిరాత్రి కలుసుకుంటానని చెప్పి, చెలికాళ్ళ లీలావినోదాలలో తోటకి వెళ్ళ మరిచాడట.

అక్కడ ఆ రాధిక స్వామికొరకై నిరీక్షించి, ఎంతకూ రాకపోగా లజ్జ, చిన్నతనంలతో ఉత్కంఠిత మనస్కురాలై వెళ్ళిపోవ ఉద్దేశిస్తూ ఉండగా, చటాలున జ్ఞప్తికిరాగా రాధిక మనసు గ్రహించిన ఆ కృష్ణ ప్రభువు, చెలికాళ్ళతో వేరుమాటలేకుండా తిన్నగా ఆమెవద్దకు పోయి ఆమెపాదాలపై తన శిరసునుంచి వేడపోయినాడట. స్వామిపై అలక మాయంకాగా లజ్జతో కంపితురాలై, సాక్షాత్ జగన్నాధుడు క్షుద్రురాలైన తనపాదాలను తాకడం భరించలేక, రాధాదేవి మాయమైపోయిందట! రాధామాధవ ప్రియ సందర్శన క్షేత్రంలోనే శ్రీ పాదపద్మాలు వెలిశాయి. అవి శ్రీ రాధాదేవి చరణకమలాలే అని కొందరి నమ్మకం.

రాధాదేవి మాయమైనప్పుడు ఆమె అంతరించినది; కాని ఆమె హృదయంలో శాశ్వతంగా వెలసి ఉన్న స్వామి పాదాలుమటుకు అక్కడే నిలచినవని కొందరి నమ్మకం. అందుచేతనే **రాధికాచరణాలనీ,**

స్వామిపాదాలనీ, (శ్రీ)చరణకమలాలనీ అనేకవిధాలుగా వీటినిగురించి ఈ ప్రాంతాల్లో చెప్పుకుంటూఉంటారు. అవి శిలతో చెక్కినవో, చందన చెక్కతో నిర్మించినవో కాని, ఏమి వర్ణం! ఏమి పరిమళం! సరిగా పద్మాచాయే. ఆహాహా! ఏమి సొగసని చెప్పేది. ఆ పాదపద్మాలను చూచితీరాలి బాబూ! ఆ పాదద్వయం సరిగా పద్మాకారమే!''

ఏమి అద్భుతమైన గాథ! రాధామాధవ లీలా వినోదంలో నిమగ్నుణ్ణయి పరధ్యానంగా ఉండగా, పైని ఏదో అలికిడి శబ్దంవిని కాబోలు, గోసాయి దుకాణపుబల్ల తొలిగించి ఆవలకు దృష్టి సారించాడు. బస్సుకాని వస్తున్నదేమో అని నేనుకూడా అటువైపు నిదానంగా చూడసాగాను. అప్పటికప్పుడే చీకటి కావచ్చింది. సమీపంలోనే ఏదో కదులుతున్న శబ్దం వినవస్తున్నది. బస్సేనేమిటి చెప్మా! కాదు, సమీపిస్తున్నది రెండెడ్లబండి! 'బస్సుకాని వెళ్ళిపోలేదుకదా, బాబూ?' అని ఆత్రంతో అడుగుతూ, బండీవాడు ఈ చెట్టు కిందకే బండిని తోలుకుంటూ వచ్చాడు. 'లేదు; ఇవాళ మరి బస్సువచ్చేటట్టు కనపడదు. ఇంత వర్షంలో ఎక్కడినుంచి బయలుదేరారు, ఏ వూరినుంచి?' అని గోసాయి ప్రశ్నిస్తూండగా బండిలోనుంచి తొంగి చూచిన ముఖాలనుపట్టి బండిలోని వాళ్ళు స్త్రీలని తెలుసుకున్నాను.

'గోపీనాథ్‌పూర్‌నుంచి పెందరాళే బయలు దేరాం. రాణీగాఁవ్ వచ్చేసరికి వర్షమారంభించింది. తీరావస్తే బస్సుదారికేటట్టు లేదంటున్నారు. పెద్దయింటి స్త్రీలు బాబూ! వస్తున్నారు. అన్నా, చాలాయిబ్బందే!' అంటూ బండీలోఉన్న స్త్రీలవేపుగా బండిమనిషి తిరిగాడు.

నిత్యగోసాయి గొడుగుతీసుకుని వెంటనేవెళ్ళి 'సరే, ఏదోఒకటి చెయ్యొచ్చు. ఇబ్బందేమీ లేదు. వర్షం ఇంకా హెచ్చుగానేఉంది. దిగండమ్మా, దిగండి! లోపల కాసేపు విశ్రమిస్తురుగాని. పాపం! శాశన పూర్‌నుంచివచ్చి వీరుకూడా ఇక్కడే ఉండిపోయారు' అని నన్నుద్దేశించిచెపుతూ, 'దయచేయండి!' అంటూ పురాతనమైన గొడుగును ఆహ్వానకరంగా బండీగూడుకు చేర్చిఉంచాడు.

బండిలోనుంచి ఇద్దరుస్త్రీలు, కొంచెం మొహ మాటపడుతూ దిగి, గోసాయి వెనువెంటనే కుటీరం లోకి వచ్చారు. బల్లని ఒకసారి తన గావంచాతో తుడిచి 'కూర్చోండి' అని తిరిగి ఆహ్వానించి, 'బండీలో ఏమేనా సామానుందా?' అని గోసాయి అంటూఉండ గానే, బండీవాడు చక్కగా కట్టిన ఒకమూటని తీసు కొనివచ్చి బల్లమీదఉంచి, 'ఎడ్లనువిప్పి కాస్త చెట్టు కిందఉంచి ఇప్పుడే వస్తున్నా'నని చెప్పివెళ్ళి కొంచెం సేపులోనే తిరిగివచ్చి, దుకాణం అవతలిచివర దుప్పటి

కప్పుకొని కూర్చున్నాడు. నేను లేచి నిలబడడం చూచి 'బాబూ, మీరిలాకూచోండి' అంటూ తన బల్లమీదకు ఆహ్వానించాడు నన్ను గోసాయి.

వచ్చిన స్త్రీలిద్దరూ బల్లమీద ఆసీనులయాక 'కొంచెం చా పుచ్చుకోండి' అంటూ గోసాయి తేనీరు తయారు చేయడం మొదలుపెట్టాడు. 'నాకు వద్దు నాయనా! పిల్లకిమటుకు కాస్త కాచితే చాలు' అన్నది స్త్రీలలో పెద్దామె. 'మీరుకూడా కొంచెం పుచ్చుకుందురుగాని — ఇప్పుడప్పుడే వర్షపుజోరు తగ్గేటట్టు లేదు' అని నన్నుద్దేశించి అన్నాడు గోసాయి.

'సరేకాని, మరిఏమిచేయడం ఇప్పుడు? తోవలో చిక్కుపడి పోయామే' అన్నది పెద్దావిడ.

'చిక్కేమీలేదు. వర్షంకాస్త తగ్గగానే రాణీగావ్ వచ్చేయండి. అందరూ మాయింట్లో ఈరాత్రికి ఉండవచ్చు. ఎలాంటి యిబ్బందీ ఉండదు' అన్నాడు హెచ్చరికగా గోసాయి.

ఇంతలోనే టీ తయారుచేసి ఆ అమ్మాయికీ, నాకూ ఇచ్చి, తానుకూడా పుచ్చుకోసాగాడు. తరువాత బండీవాడుకూడా మొహమాటపడుతూ, వారగా వెళ్ళి టీ పుచ్చుకున్నాడు.

వచ్చిన స్త్రీలను నేను నిదానంగా చూడలేదు కాని సంపన్నమైన కుటుంబానికి చెందినవారనీ, సుకుమారులనీ అనిపించింది. టీ పుచ్చుకుని, గోసాయి

ఇచ్చిన పాన్ సేవిస్తూఉండగా పెద్దామె నన్ను ద్దేశించి 'మన దే[గ్రామం నాయనా?' అన్నది. నేను చెప్పాను. ఆవిడ ఆశ్చర్యపడుతూ అడగసాగింది: "ఏమిటీ! రాధా మోహనపురమా మనది? ఆచార్యులవారి కుటుంబా న్నెరుగుదువా బాబూ?"

"నీలమణి ఆచార్యులవారి కుటుంబమా?"

"అవును బాబూ! నీలమణి మాకు దగ్గరవాడే. చాలారోజులయింది వాళ్ళందరినీ చూసి."

"కవిరాజ్ నీలమణి ఆచార్యులవారా అమ్మా?" నిత్యగోసాయి ప్రశ్నించాడు.

"అవును నాయనా! బింబాధరాచార్యులవారి కుమారుడు, నీలమణి" అన్నదామె.

తరువాత ఆవిడ అడిగిన సంగతులన్నీ చెప్పి, ఆచార్యులవారిదీ మాదీ ఒకటేవీధని, వారందరితో నాకు బాగా చనువేననీ తెలియచేశాను.

వంశపారంపర్యంగా వస్తున్న ఆచార్యులవారి ఆయుర్వేదవైద్యం ఈప్రాంతాల్లో సుప్రసిద్ధమేనని చెపుతూ గోసాయి, 'గోపీనాధపూర్ హరిపల్లికి బాగా దగ్గరేకదా; ఇంతసేపూ నృత్యగోపాల ఉత్సవాల గురించే చెప్పుకుంటున్నాం' అన్నాడు.

అందుమీద నృత్యగోపాల ఉత్సవాల గురించి ప్రస్తావన కొంచెం తిరిగీ జరిగింది. ప్రస్తావనలో పాల్గొ

నకపోయినా చిన్న ఆమె అట్టేకొత్తకాని, మొహమా టంకాని కనపర్చ లేదు.

మేమూ అనుకుంటూండగానే బండీవాడు 'అమ్మా వర్షం కాస్త తగ్గింది. ఏంబాబూ! మోటార్ గాడీ ఇక రాదన్నమాటే' అంటూ వచ్చాడు. నిజమే; వర్షంజోరు బాగా తగ్గింది, చినుకులింకా పడుతున్నా. ఈ ముసురు ఇప్పుడప్పుడే వదిలేటట్టు లేదు. బాగా చీకటైపోయింది. ఇక బస్సెలాగా రాదు. గోసాయికూడా అదే సూచించి 'బాబూ, అమ్మా; పదండి. రాణీగాంవ్ వెళదాం. ఈపూటకి మా యింట్లోనే భోజనంచేసి, ఎలాగో మరి రాత్రికి ఉండిపోండి. మొహమాటమేమీ పడకండి; బాబూ! ఇక ఆలస్యంచేయక వెళదాం పదండి' అన్నాడు.

'ఆదరించి ధైర్యం చెప్పేవాళ్లుండగా మాకు ఎటువంటి ఇబ్బందీ ఉండదు. లేకపోతే త్రోవలో ఎంత చిక్కుపడిపోయేవాళ్ళం!' అన్నది పెద్దావిడ. అవును, గోసాయి ఆదరపూర్వకమైన ఆహ్వానాన్ని సంతోషంతో అంగీకరించడంకంటే మరి గత్యంతరం ఏమిటి ?

బండీ కట్టేసరికి గోసాయికూడా బల్లతలుపులు సర్దివేశాడు. బండివద్దకు వస్తూ, 'బాబూ, మీరిద్దరూ కూడా బండీలోనే కూర్చోండి; ఇంకా చినుకులు పడు తున్నాయి' అని పెద్దామె ఆప్యాయంగా చెప్పింది. 'బాబూ, మీరు కూర్చోండి. నేను దీపంతో ముందు

నడుస్తాను. దారి కొంచెం ఎగుడుదిగుడుగా ఉంటుంది' అన్నాడు నిత్యగోసాయి.

'కావలసినంత చోటు బాబూ! ఈ బాట నాకు తెలియనిది కాదు. మీరు లాంతరు కాస్త పట్టుకొని ముందుకూర్చోండి. బాబు వెనకను కూర్చుంటారు' అన్నాడు బండీవాడు.

నేనుకొంచెం మొహమాటపడడం గమనించి పెద్దామె 'రా నాయనా! మొహమాటపడడం దేనికి? మీవారందరినీ నే నెరుగుదును; మాయింట్లో అబ్బాయి వంటి వాడవే' అని ఆదరంగా పిలిచింది. మొహమాటం విడిచి నేను వెనకతట్టున కూర్చున్నాను. నిత్యగోసాయి బండీముందు, వెలుగు దారిలో పడే లాగున, లాంతరుపట్టుకుని కూర్చున్నాడు.

రాణీగాంవ్ గ్రామానికి పోయేరోడ్డు నాటుదారే కాని గోసాయికీ, బండివాడికీ బాగా అలవాటేకనక నిబ్బరంగా సాగిపోనిచ్చారు. నిత్యగోసాయి బండి వాడితో ఏవో కబుర్లు చెబుతున్నాడు. ఆ కబుర్లే మేంఅంతా వింటూకూర్చున్నాం. రాణీగాంవ్ చేరే టప్పటికి సుమారు తొమ్మిదిగంటలే అయినా, గ్రామం అంతా మాటుమణిగే ఉన్నది. వర్షంచినుకు అలాగే పడుతోంది.

'ఈ పక్క వీధిలోనే మాయిల్లు. రాత్రికి ఉండి పోండి, బండీ అటు తిప్పు' అన్నాడు గోసాయి; కాని,

పెద్దామె 'నాయనా, అభిమానంతో పిలిచావు. చాలా సంతోషంగావుంది; కాని ఇక రెండుక్రోసుల దూరమే కదా మాగ్రామానికి — మరిఒకలా గనుకోకు — వెళ్ళిపోతాం' అన్నది.

తనకెట్టి యిబ్బందీ ఉండదనీ, మొహామాటపడ వద్దనీ గోసాయి చాలా చెప్పాడు కాని, ఆమె 'లేదు నాయనా; ఇబ్బందనికాదు. ఎలాగా బయలుదేరాం. మరిరెండుగంటలు కూర్చుంటే తీరిపోతుంది. నీలాంతరు మటుకు కాస్త మాకియ్యి. వెంటనే పంపించేస్తాను' అని నావేపుతిరిగి 'బాబూ, నువ్వుకూడా మాతోవస్తే మాకు సాయంగా ఉంటుంది. రాత్రి కక్కడఉండి తిరిగి మళ్ళీ మాతోనే రావచ్చును. తొందరైనా పొద్దున్నే బండీమీద వెళ్ళిపోవచ్చును. ఏంబాబూ?' అన్నది.

'అవును బాబూ; గోపీనాథ్‌పూర్ వెళ్ళడానికే నిశ్చయిస్తేమటుకూ మీరుకూడా వెళ్ళడమేమంచిది. భయమేమీ లేదుకాని, ఆడవాళ్ళు రాత్రి ఒక్కరూ ప్రయాణంచేయడం మంచిదికాదు. లాంతరు తీసుకు వెళ్ళండమ్మా...నాకేమీ తొందరలేదు. మాయింటికి ఒక్కసారి దయచేయరా? ఇన్నిపాళ్ళైనా తాగుచురు గాని. తగినసత్కారం చేయలేకపోయాను' అన్నాడు ఎంతోఆదరంతో గోసాయి.

'అయ్యో నాయనా! మీఇంటికి తప్పకుండా

రావలసినవాళ్ళమే. మరి ఆలస్యమెందుకు...ఏమీ అను కోకు నాయనా, వెళ్తాం' అన్నది పెద్దామె.

'జాగ్రత్తగా తోలుసుమీ!' అని బండీవాడిని హెచ్చరించి, 'అమ్మా, బాబూ, సెలవు...రేపు దుకాణంవద్ద కలుస్తాను' అని గోసాయి వెళ్ళిపోయాడు.

బండీవాడు లాంతరు బండీకికట్టి, 'బాబూ, కొంచెం లోపలికి కూర్చోండి' అని తోలడం మొదలు పెట్టాడు. 'రా, బాబూ ; సదుపాయంగాకూర్చో... చాలా చోటుంది, మొహమాటపడకు' అన్నదావిడ. నేను లోపలికి జరిగి కూర్చున్నాను. బండీ మెల్లగా సాగిపోతూంది. వర్షం అలాగే కురుస్తూంది. ఎవరమూ అట్టే మాట్లాడుకోవడంలేదు. నిశ్శబ్దంగాఉంది. ఉండి ఉండి రివ్వుమని గాలివేసినప్పుడుమటుకు జల్లుకొట్టి కొంచెం చలికూడా వేస్తూంది. చిన్నామె, నేను మరి కొంచెం లోపలికి రావలెననే ఉద్దేశంతో కాబోలు, ముందుకుజరిగి, 'జల్లు వస్తున్నదేమో' అంది. 'శాలువై నా పైని లేదామెను. ఎవరినిచూచి అంత మొహ మాటం, అయ్యో అబ్బాయీ!' అన్నది పెద్దామె. వారి ఆప్యాయతకు నాకు చాలా సంతోషం కలిగింది. జల్లు నామీదకు రావడంలేదనీ, సదుపాయంగా కూర్చు న్నాననీ, మొహమాటపడడంలేదనీ చెప్పాను.

రాణీగాంవ్ విడిచి సుమారు ఒక గంట అయి వుంటుంది. దూరాన్ని లాంతరుతో ఎదురుగా ఎవరో

వస్తున్నారని ఆ అమ్మాయే మొట్టమొదట చూచి అన్నది. ఎవరు చెప్మా, అనుకుంటూ అటువేపే చూస్తూన్నాం. కొంచెంసేపటిలోనే లాంతరుతో వస్తున్న ఇద్దరుపురుషులూ బండీని సమీపించారు. వారిద్దరిచేతుల్లోను కఱ్ఱలున్నవి. లాంతరుఎత్తి బండీలోనికి చూస్తూ 'ఎవరు బండీలో?' అన్నారు. బండీ ఆగిపోయింది. స్త్రీలిద్దరూ పాపం చాలా భయపడినట్లున్నారు. నాకూ కొంచెం భయంవేసింది. కాని, వెంటనే ధైర్యం తెచ్చుకుని నాకఱ్ఱ తీసుకుని బండీనుంచి దిగి 'ఎవరోయి, ఎందుకు?' అని ఘట్టిగా అడిగేటప్పటికి ఏమనుకున్నారో కాని 'నమస్కారంబాబూ, మధుపురం ఖార్జీ (గ్రామ మునసబు) గారేమోనని చూస్తున్నాం. సాయంకాలం రాణీగాఁవ్‌కి బయలుదేరారు. తోవలో చిక్కుపడిపోతారేమోనని వస్తున్నాం. మీకు తోవలో ఎవరేనా కనిపించారా?' అని అడిగారు. మాకెవరూ కనిపించలేదని చెప్పి, తోలమని బండీవాడిని హెచ్చరిస్తూ తిరిగి బండీ ఎక్కాను. లాంతరుతో వచ్చినవారు తిన్నగా రాణీగాఁవ్ వేపు వెళ్ళిపోయారు.

లాంతరు రోడ్డు మళుపున మాయమయేవరకూ ఎవరూ మాట్లాడలేదు. అమ్మాయి మరీ భయపడినట్లుంది. 'వాళ్ళుకాని దొంగలేమో! నాకు భయంగా ఉంది' అని మెల్లిగా అంది. నాకున్నూ మనసులో కొద్దిగా అనుమానం వేసినా ఉషారుగానే 'అబ్బే,

దొంగలు కారు. భయమేమిటి, నేనున్నాను; బండీవా డున్నాడు. ఏమీ భయంలేదు' అని కొంచెం ధైర్యమైన మాటలన్నాను. పెద్దావిడ కూడా, 'భయంలేదమ్మాయీ; వీరున్నారు కాదూ...బాబూ; నువ్వు మాతో రావడం రక్షించింది. లేకుంటే ఏలాగు వెళ్లే వాళ్ళమో' అంది. బండీవాడేమీ మాట్లాడకుండా తోలుతున్నాడు.

'గోపీనాథ్ పూర్ యింకా ఎంతదూరముంటుం దోయ్ ?' బండీవాడి నుద్దేశించి అడిగాను.

"వచ్చినంత దూరం మరి ఉండదు బాబూ!"

"తోవలో మరే గ్రామాలూ లేవ్వా ?"

"అదిగో...ఆ మళుపు తిరిగిన కాస్తదూరం లోనే ఝురీగాంవ్ తటాకం బాబూ."

"ఈ రాత్రికి ఝురీలో ఉండిపోతే మంచిదేమో-ఆడవాళ్లు భయపడుతున్నట్టున్నారు."

"ఎందుకు బాబూ — ఝురీ దాటాక గోపీనాథ పూరే. దొంగలభయ మెప్పుడూ లేదు."

కొంచెంసేపు నిశ్శబ్దంగా బండి వెళ్ళిపోయింది. దారిలో ఎట్టి అలికిడీలేదు. ఝురీగాంవ్ తాటకం సమీపించినప్పుడుమటుకు దూరాన్నుంచి ఏదో జంతువు అరిచింది. అమ్మాయి వాళ్ళపెత్తల్లిదగ్గరగా జరిగి 'నాకు భయమేస్తూంది' అని మెల్లగాతిరిగి అంది. 'భయమేమిటి అమ్మాయీ! వీరూ నేనూ అంతా

వున్నాం కాదూ' అని ధైర్యం చెబుతూ పెద్దామె మందలించింది. 'భయమెందుకూ? మేమంతా ఉన్నాం కాదూ' అని నవ్వుతూ నేనూ హెచ్చరించాను.

మా కుటుంబంతో వీరి కిదివరకున్న స్నేహం చేతనూ, అవసరసమయంలో ఒకరికొకరు సహాయంగా ఉండవలసిన కారణంచేతనూ కొంచెంకాలంలోనే చిరపరిచితునివలె చనువు ఏర్పడింది. స్నేహబంధం యొక్క ఆకర్షణారహస్యానికీ,సున్నితమైన ఆఅమ్మాయి అమాయికత్వానికీ ఆశ్చర్యపడుతూ, జీవితంలో సంభవించే సంఘటనల పై చిత్రాన్ని తలుచుకుంటూ పరధ్యాన్నంగా కూర్చున్నాను. బండీవాడు, ఝురీగాంవ్ తటాకం తవ్వించిన సామంతరాయ్ ధర్మాన్నీ, గుణగణాల్నీ వర్ణిస్తూ ఏవోసంగతులు చెబుతున్నాడు. ప్రయాణం నెమ్మదిగా సాగుతూంది.

ఝురీగ్రామందాటి గోపీనాధపూర్ మలుపు తిరిగేసరికి చక్కగా గాలివేయసాగింది. మేఘాలుకూడా చెదరిపోసాగినవి. 'సముద్రపు గాలిలాగున్నదే. ఎంత మనోహరంగా ఉన్నది!' అన్నాను. 'అవును. సముద్రపుగాలి ఈప్రాంతాల్లో వేస్తూవుంటుంది. చిల్కా అట్టేదూరంలోలేదు. అన్నట్టు మరిచిపోయాను. ఎంత మరపు! కాస్తఫలహారంచేస్తురుకాని, పాపం భోజనం చేయకుండా బయలుదేరారు' అని ఆవిడ మాటతీస్తూ అన్నది.

'నాకంత ఆకలిలేదు; మీరుపుచ్చుకోండి' అని నన్ను ఉద్దేశించి అమ్మాయి అంది. నిత్యగోసాయి టీ శాలలో ఫలహారంచేశాననీ, నాకూ అంత ఆకలిగా లేదనీ, వారిద్దరినీ ఫలహారంచేయమనీ చెప్పాను. 'సరే, గ్రామానికి చేరాక ఫలహారంచేద్దురు కాని; ఇన్ని అరటిపళ్ళైనా పుచ్చుకోండి' అంటూ అరటిపళ్ళు మా యిద్దరికీ ఇచ్చింది. 'మీరూ పుచ్చుకోండి పిన్నీ' అన్నాను. ఆమె నవ్వుతూ 'పెద్దదాన్ని నా మాట కేమి; పిల్లవాళ్ళు మీరు ఆకలితో ఉండకూడదు' అంది. అంతా అరటిపళ్ళు పుచ్చుకున్నాక, 'వారు తాంబూలం వేసుకుంటారేమో! అమ్మాయీ, పాన్ దాన్ తీసిఇయ్యి' అన్నది. అమ్మాయి పాందాన్‌నుంచి తీసియిచ్చిన సుగంధపరిమళమధురమైన తాంబూలం సేవిస్తూ, చనువుగా 'పిన్నీ! గోపీనాథపూర్‌కి హరిపల్లె దగ్గిరేనటకదా;నృత్యగోపాల ఉత్సవాల సంగతులింకా నాకు వినాలెననే ఉన్నది' అన్నాను.

'తప్పకుండా ఈమాటు మాయింటికి రాబాబూ, అంతా కలిసి వేడుకలు చూదాం. ఏమయినా మా చిన్నతనంలో ఉండే వేడుకలూ, విలాసాలూ ఇప్పుడు లేవుసుమీ! అప్పటి గోప గోపీ వినోదా లేమిటి! ఆటపాటలేమిటి! రాధామాధవ లీలోత్సవా లేమిటి! ఏమిహాయి అయిన రోజులవి! అబ్బాయీ! మా అమ్మమ్మ చెబుతూండేది వాళ్ల చిన్నప్పటి రోజులగురించి,

సాక్షాత్తు రాసక్రీడలా అనిపించేదట. కుంజవనంలో రాధామాధవ సందర్శన స్మరణార్థం పౌర్ణమినాటిరాత్రి చరణోత్సవమని చేసేవారట! అమ్మాయిలంతా కాళ్లకు పారాణి, పాదాలకు లత్తుక రాసుకుని రాధాదేవివలె మహా నాజూకుగా శృంగారించుకుని ఉత్సవంలో పాల్గొనడానికి బయలుదేరేవారట. అప్పటిశోభ, అలంకరణ, సరదాలూ ఇప్పుడు లేనేలేవు. అంతకంతకూ అన్నిటివలెనే ఉత్సాహాలూ, సరదాలూకూడా తగ్గిపోతున్నవి. అబ్బాయీ, ఉత్సవాలకు ఈ ఫల్గుణమాసంలో ఏమయినా — మరచిపోకుండా రావాలి సుమీ' అని, వెనకటిదినాల మాధుర్యాన్ని తలుచుకొని కాబోలు నిట్టూర్పు విడిచింది.

ఉత్సవపు సంగతులూ, వేడుకలూ వింటూంటే నా ఆశ్చర్యానికీ, సంతోషానికీ మేరలేకపోయింది. ముగ్ధుడనై పోయాను.

ఆహా! ఎంతచక్కని వేడుకలు, ఎంతమనోహరమైన లీలలు! పాతకాలపు వైష్ణవ సాంప్రదాయంలో ఉండే వైభవం, లాలిత్యం నేడు నశిస్తున్నది కదా అని నేనూ నిట్టూర్పువిడిచాను. ఉత్సవాల ప్రస్తావనలో ప్రయాణం హాయిగా జరిగిపోయింది. గోపీనాథపూర్ సమీపిస్తున్నామంటే ఈ చిరస్మరణీయమైన ప్రయాణం అయిపోవస్తున్నదే అని విచారమే వేసింది.

కొంచెంసేపటిలోనే గ్రామానికి వచ్చేశాం.

'బాబూ, నీసహాయం ఎప్పటికీ మరిచిపోలేం. నువ్వు లేకపోతే ఎంతయిబ్బంది పడిపోదుమో?' అన్నది పెద్దావిడ. అమ్మాయికూడా స్నేహంతోనూ, చనువుతోనూ నావేపుచూసింది. నా కృతజ్ఞత మనస్సులోనే దాగిపోయింది. గ్రామం అంతా నిశ్శబ్దంగావుంది. ఇంతలోనే వారింటిముందు బండి ఆగింది. నేను మొదట దిగి, చీకటిగా ఉండడాన్ని చేయిపట్టుకుని మెల్లిగా ఒకరితరువాత ఒకరిని దింపాను. బండీవాడు లాంతరు విప్పి తీసుకొనిరాగా అంతా ఇంట్లోకి వెళ్ళాం. అప్పటికి బహుశా పదకొండుగంటలు దాటేవుంటుంది. కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళూ, తువాలూ అమ్మాయి తెచ్చింది. వాళ్ళూ పాదప్రక్షాళన చేసుకున్నారు. అంత ఆకలి లేకపోయినా పెద్దామె, బలవంతం చెయ్యడాన్ని మేమిద్దరం కొంచెం ఫలహారం చేశాం. నాకు వారు పరుండే పక్కసావిడిలోనే పక్క వేశారు.

నేను విశ్రమించపోతూండగా అమ్మాయి నెమ్మదిగా ప్రవేశించి దీపం, మంచినీళ్ళపాత్ర అక్కడ ఉంచి 'మీకు చాలాశ్రమ అయింది' అన్నది. 'శ్రమ అయినది మీకుకాని నాకేమిటి! మీస్నేహాన్ని ఎప్పటికీ మరచిపోను' అన్నాను.

ఆమె ఏమో చెప్పబోయి సిగ్గుపడికాబోలు ఊరుకున్నది. నేనున్నూ చూపులువాల్చి ఆమె పాదాలవేపే చూస్తూ ఊరుకున్నాను.

'వస్తాను' అంటూ ఆమె వెళ్ళిపోయింది. ఇంత వరకూ నేను నిదానంగా చూడలేదు; కాని ఎంత సున్నితమైన పాదా లామెవి! ఆహా!

ఈ ప్రాంతాల్లో విహరించే పద్మవిలాసినుల కాటుకకళ్ళూ, విరివైన కుంతలాలేకాక పాదలాలిత్యం, లావణ్యం నే నెరుగకపోలేదు, కాని ఇంత చక్కని పాదద్వయం నే నెప్పుడూ చూడలేదు.

ఎప్పుడు నిద్రపట్టిందో నాకు తెలియదు, కాని నేను చూసిన పద్మచరణశోభ స్వప్నమాధుర్యం కాదుకదా! నేను నిశ్చయంగా ఇప్పుడు చెప్పలేను. ఆ దివ్యసందర్శన మెప్పటికీ మరపురాదు.

ఆ రెండవరోజు ఉండిపొమ్మని వారెంత బలవంత పెట్టినా ఉత్సవాలకు తప్పకుండా వస్తానుకదా అనిచెప్పి తెల్లవారుఝామునే, బయలుదేరడానికి వారివద్ద సెలవు తీసుకున్నాను. బండిమీద వెళ్ళమని వారన్నారు. కాని నడవడమే సదుపాయంగా ఉంటుందని చెప్పాను. పాపం! పొద్దున్నే వాళ్ళులేచి నా సదుపాయాలన్నీ కనుక్కొని టీ, ఫలహారంచేసి ఇచ్చారు. తిరిగి ఉండమని ఎంతో ఆదరంతో కోరారు. నాకూ ఉండవలెననే ఉన్నదనీ, వారి స్నేహం చిరస్మరణీయమైనదనీ, కాని అవసరకార్యం ఉండడంవల్ల మా గ్రామానికి వెళ్ళవలెననీచెప్పి పెద్దామె పాదాలకు నమస్కరించి

సెలవు తీసుకున్నాను. ఆనందాశ్రువులతో ఆమె న న్నాశీర్వదించింది. అమ్మాయి వేపు తిరిగాను.

ఆమె అన్నది కదా... 'శ్రీ రాధికాచరణములు దర్శించకుండా వెళ్ళిపోతున్నారు!'

'దేవీచరణాలను విడిచి ఎక్కడకు వెళ్ళగలను! తప్పకుండావచ్చి దర్శిస్తాను' అని మాత్రం అన గలిగాను.



# సమత్తమ్మగారు

గుంటూరుపోయే రైలు అరగంట ఆలస్యం అని తెలిసి నేనూ, రామం, శాస్త్రి సావకాశంగా కాఫీ పుచ్చుకోడానికి 'కాంటీన్' కు పోయాం. మేము ప్రవేశిస్తున్న సమయానికే ఒక నడివయసులో ఉన్నాయనా, యౌవ్వన వయసులోఉన్న అమ్మాయీ కాంటీన్ నుంచి బయటికి వచ్చేస్తున్నారు. ఆయనకు యాభై సంవత్సరాలకు పైబడి వుండవచ్చు. ఆయనతీరు కొంత వరకూ బంగాలీమాదిరిగా ఉన్నట్టనిపిస్తుంది. అమ్మాయి వయసు పాతికేళ్ళ లోపుండవచ్చు. ఆమెతీరేకాకుండా రూపంకూడా బంగాలీ తరహాగా ఉన్నది.

వాళ్లు గడపదాటగానే, కాఫీ తెమ్మని కుర్రవాడికి చెప్పి, మావేపుతిరిగి రామం అన్నాడు: 'ఆవిడ సమత్తమ్మగారు కాదూ?' అవునన్నట్టుగా శాస్త్రి తల ఊపాడు.

సమత్తమ్మగారి పేరు ఈ చుట్టుపట్ల బాగా పరిచయమే, కాని ఆవిడని గురించి నాకు కాని, రామానికికాని అట్టే విశేషాలు తెలియవు.

'అసలామె తెలుగు అమ్మాయేనా?' రామం శాస్త్రి నుద్దేశించి అడిగాడు. మాలో బాగా భోగట్టా కలవాడు శాస్త్రేను. కాఫీ అయాక సిగరెట్టు ముట్టిస్తూ

శాస్త్రివేపు ప్రశ్నార్థకంగా ఇద్దరమూ చూశాం. శాస్త్రిచెప్పిన కథ ఇది:

'అసలావిడ పేరు అర్పణాదేవి, లేక సమర్పణా దేవి. అర్పణాదేవి అంటే అంతా అప్పణమ్మగారూ అనడంవల్ల ఆమె తండ్రి సమర్పణాదేవి అని మార్చారు. కాని మన తెలుగు సంస్కృతి ప్రాబల్యంవల్ల సముత్తమ్మ అని తేలింది. ఆమెగారితండ్రి రామేశంగారు కొంత కాలం బ్రాహ్మసమాజికుడు కొంతకాలం దివ్యజ్ఞాని, కొంతవరకూ గాంధీవాదిన్నీ, కొద్దిగా ఖద్దరుధారిన్నీ. ఈ తరహా మనుష్యులు కాకినాడ, పిఠాపురం, కొవ్వూరు, గుంటూరు ప్రాంతాల్లో ఏ కారణంచేతో తరుచూ వెలుస్తూ ఉంటారు. బి.ఏ. పేసై, ఉద్యోగం చెయ్యక, ఉన్న కొద్దిఆస్తిసీ ఖర్చుచేసి, ప్రపంచం మరమ్మత్తు తలపెట్టి, ఆఖరికి సర్వజనద్వేషి అయి తుదకబ్బెనురా ఫలాని బుద్ధి అని ఏ కామ్రేడుల్లోనో కలిసిపోవడం పరిపాటేగా మన తెలుగువాడికి?'

'ఏ కామ్రేడుల్లోనో ఏమిటి, ఏ కాంగ్రెసు కూటంలోనో అనకూడదూ?' అన్నాడు రామం. రామం కొద్దిగా 'లెఫ్టిస్టు' లెండి. ఆమాట వినిపించుకోకుండానే చెప్పసాగేడు శాస్త్రి: 'చెప్ప మరిచాను. ఆ ఆఖరు రోజుల్లో రామేశంగారు మాల్థస్సువాదాన్నీ మార్క్సిస్టు వాదాన్నీకూడా సమన్వయించ ప్రయత్నించినట్టు వినికిడి. మరి దాని ఫలితమో ఏమిటో, ఆయన వివాహంసంగతి

నిశ్చయంగా ఎవరికీ తెలియదుకాని ఆయనకో 'కుమా ర్తె' ఉంటూ వచ్చింది! దిక్కు లేని పిల్లను చేరదీసి పెంచా డని కొంతమంది అంటారు; లేదు ఆయన మాంచి బ్రాహ్మాగా ఉన్నప్పుడు కలకత్తాలో ఓ బంగాలీ వితంతువును వివాహమాడాడనీ, ఆమెవల్ల కలిగిన సంతానమనీ కొంతమంది అంటారు. అసలీ వివాహానికి పూర్వమే ఆ బంగాలీ వితంతువుకు కుమా ర్తె ఉన్నదనీ, కుమా ర్తెతోసహా రామేశంగారు వివాహంచేసుకున్నా రనీ మరికొంతమంది అంటారు.'

రామం చిరాకు కనుపరుస్తూ అన్నాడు: 'కుమా ర్తెతో సహా వివాహం చేసుకోవడ మేమిటి శాస్త్రీ, శిశువున్న వితంతువును పెళ్ళిచేసుకున్నా డన కూడదూ? దానిలో తప్పేముంది? ఇంతకూ నువ్వు చెప్పే సంగతికీ, మాల్థస్ — మార్క్సిస్టు వాదాలకీ గల సంబంధం ఏమిటో అర్థంకావడంలేదు.' రామం అన్ని విషయాల్లోనూ కొద్దిగా సంస్కారిలెండి. అయితే, శాస్త్రితత్త్వం రామానికి తెలియకపోలేదు. శాస్త్రి దేనినీ అట్టే నిరసించడూ, మరీ ఆమోదించడూ. ఉద్దే శమేదో స్పష్టంగా తేల్చక, హాస్యం, హేళనా కలిపి మాట్లాడతాడు ఏ విషయం గురించైనా. అందుచేత, 'ఉండరా రామం, శాస్త్రి రిమార్కు కేం, సంగతి చెప్పనీ' అన్నాను.

శాస్త్రి, చిన్న చిరునవ్వు నవ్వి, చెప్పసాగేడు: 'ఏమయినా నిలవదీసి, అమ్మాయి అసలు సంగతి ఏమిటయ్యా, అని అడగ ఎవరు సాహసించగలరు చెప్పండి! మరోసంగతి, ఆయన కొంతకాలం విశ్వశక్తిఅనో, విశ్వాభ్యుదయం అనో ఓ వారపత్రికో, పక్షపత్రికో నడిపారు, ఆరుమాసాలో, తొమ్మిదివారాలో! శరత్ చటర్జీ నవలలుకూడా ఒకటిరెండు తెనిగించారుట. అరడజను శరత్ చటర్జీ నవలలు తెనిగించకపోతే అసలాంధ్రుడే కాదుగామరి! మామూలుగా తెలుగువాళ్ళందరిలాగే రామేశంగారుకూడా మొదట్లో శరత్ అభిమానీ, బంగాలీ అభిమానిన్నీ. వారి ఉద్దేశంలో, సున్నితమైన సందేష్, రసగుల్లా తినడంవల్ల, బంగాలీ వాళ్ళ వంట్లో కళాపానకమే కాని కఠినరక్తం ప్రవహించదట.

'ఇంకా యిలాంటి నమ్మకాలు బంగాలీవాళ్ళను గురించి చాలా వుండేవిట. వాళ్ళ నాజూకుతనం, సుకుమారత్వం, సౌందర్యమాధుర్యం పూర్వం ఎంత మెచ్చుకునేవారో యిప్పుడంత విసుగు ఆయనకు. కాపురం చేశారుగా, అంత సుఖప్రదం అవలేదుటకాని. మాంచి దోసావకాయా, గోంగూరా, కమ్మని నెయ్యీ, గేదెపెరుగూ వేసుకుతింటూ నిగారైన జిగటరక్తంకల తెలుగువాడికి, పానకంపులుసు వంట్లో ప్రవహించే

వాళ్ళతో, ఎంత నాజూకైనా, దాంపత్యం ఎలా కుదురుతుంది చెప్పరా, రామం?'

ప్రశ్న అంత రుచించినట్టు లేదుకాని, రామం కూడా ఈ మాటలకు నవ్వకుండా ఉండలేకపోయాడు. సిగరెట్ ధూళి దులిపి, శాస్త్రి చెప్పసాగేడు: 'సామాన్యంగా మన తెలుగువాళ్ళందరిలాగే రామేశంగారికి కూడా చిన్నప్పటినుంచీ, అనగా బంకిమ్‌చంద్ర చటర్జీ నవలలకు తెలుగుఅనువాదాలు చదివే రోజుల్నుంచీ, బంగాళీవాళ్ళన్నా, వాళ్ళ సంస్కృతిఅన్నా చాలా 'గ్లేమర్' ఉంటూండేది. అందుచేత బి. ఏ. ముగించకుండానే పెళ్ళిళ్ళయేవి కదూ? రామేశంగారికికూడా వాళ్ళవాళ్ళు పెళ్ళికి ఓసంబంధం చూసుకున్నారు, ఆ రోజుల్లోనే. మేనరికం కాదుగాని, వరసకి ఏ వేలువిడిచిన ఓ మేనమామ కూతురు. ఆ అమ్మాయిపేరు సుభద్ర, కాని అంతా సుబ్బులూఅనే పిలిచేవారు. ఆమెను నే నెరుగుదును. పెద్ద 'బ్యూటీ' కాకపోవచ్చును కాని సలక్షణమైన స్త్రీఅని చెప్పకతప్పదు. ఈ సంబంధం రామేశంగారికి నచ్చలేదట.

'అసలా అమ్మాయిని ఎప్పుడో చిన్నప్పుడు చూచేరుకాని, ఆమెసంబంధం తలపెట్టిననాటిముందు అయిదారు సంవత్సరాలలోగా చూడలేదు. ఆరోగ్యమూ, అంగసౌష్ఠవమూ, మంచి సంప్రదాయమూ కలిగి, కాస్త కలవారిఅమ్మాయిఅనీ, ఆమెను సరిగా

నేనా చూడకుండానే ఈ విముఖత ఏమిటిరా అనీ, పెద్దవాళ్లూ, సన్నిహితులూ రామేశంగార్ని మందలించారుట. కాని రామేశంగారు ససేమిరా చూడడానికేనా ఒప్పుకోలేదు. అసలాయన ఇష్టపడక పోవడానికి వ్యక్తిగత కారణం అట్టేలేదు. మేనరికం సంబంధాలవల్ల తెలుగువాళ్లలో 'రొమాన్సు' నశిస్తున్నదనీ, అట్టి దగ్గిర సంబంధాలు వాంఛనీయము కావనీ ఆరోజుల్లో రామేశంగారు గట్టిగా నమ్మేవారు. అది ఎంతవరకూ పోయిందంటే, వరసకి మేనరికంఅయినా సంబంధానికి ఒప్పుకోనన్నారు. అంతేకాదు; సుబ్బులూ అనే పేరు ఆయనకు చాలా వ్యగ్రత కలిగించింది. ఆ రోజుల్లో, ఆబారాణి, అనాధబాల, అంజలిదాసి, ఒనీమాదేవి — యిలాంటిపేర్లంటే ఆయన చెవికోసుకోవడమేకాకుండా, నాలుకకూడా చప్పరించేవారట.

శాస్త్రి ఈ మాటలకు నాకు నవ్వొచ్చింది. రామంమట్టుకు, 'ఆబారాణి, అంజలిదాసిలాంటి పేర్లంటే ఉండవచ్చును, కాని అనాధబాలఅని బెంగాలీపేరుంటుందనుకోను' అన్నాడు 'సీరియస్'గా.

శాస్త్రి చిరునవ్వు నవ్వి, 'మాటకన్నాను అటువంటి పేర్లంటే రామేశంగారికి ఆరోజుల్లో చాలా ప్రీతి అని; అనాధబాల కాకపోతే అగాధబాల, అకళంకబాల వంటి పేర్లనుకో. 'పోనీరా, సుబ్బులూ అనకపోతే సుభద్రాదేవి అనే వాడవచ్చు; ఆమెపేరు

సుభద్రకదా' అని పెద్దవాళ్లు నచ్చచెప్పారుట, కాని, సున్నితమైన పేర్లేనా పెట్టుకోలేని తెలుగువాళ్ళ సంస్కారమేమిటనీ, వాళ్ళతోకంటే ఏ బెంగాలీ అమ్మాయి అయినా నయమనీ నిశ్చయానికి వచ్చారు రామేశంగారు. ఆయన దృఢాభిప్రాయాలు తెలిసేసరికి, ఎంతైనా శాస్త్ర తాహతుగల సాంప్రదాయమైన కుటుంబంకదా, బొత్తిగా శాకాహారు లేనాకాని ఏ దూరప్రాంతపు పిల్లనో తొందరపడి కట్టుకోకురా అని కాళ్ళావేళ్ళా పడ్డారుట, కావలసినవారంతాను. ఏమయినా, సాక్షిగా పోతున్న వాళ్ళ సంసారంలో పెద్దతుపాను చెలరేగింది, రామేశంగారి ధోరణిఫలితంగా.

'రామేశంగారు కలకత్తాలో ఉండగానే బంగాలీ వితంతువును పెళ్ళిచేసుకున్నట్టు తెలుస్తుంది. ఆ తరువాత కుటుంబంతో తెగతెంపులు చేసుకొని, చాలా ఏళ్ళవరకూ ఈ ప్రాంతాలకే రాలేదు. బెంగాల్‌లోనో, ఉత్తరదేశపు ప్రాంతాల్లోనో, ఎక్కడెక్కడ గడిపేవారో, ఏమేమి చేసేవారో మనకు తెలియదు. చాలా అవస్థలుమటుకూ పడ్డట్టు కనిపిస్తుంది. ఆయనగారి బంగాలీభార్య అందమైనదీ, సుకుమారమైనదేనుట, కాని చురుకుతనమూ, ఉల్లాసమూ తక్కువట. ఎప్పుడూ ఏదో నీరసమేనుట. తీసుకొని తీసుకొని, పెళ్లైన ఆరేండ్లకు చనిపోయిందట. అప్పటినుంచీ ఏమిటి.— మొదటి నుంచిన్నీ, అర్పణాదేవిని, అనగా సమత్తమ్మను,

రామేశంగారే బాల్యావస్థనుంచీ పెంచక తప్పింది కాదుట. ఈమధ్యే, అయిదారు సంవత్సరాలై, ఈ ప్రాంతాలకు తిరిగి వచ్చారు. ఎలాగో చిక్కుల్లోనే కాలక్షేపంచేస్తున్నారు. చెప్పానుగా, ఉన్నకొద్ది ఆ స్తిస్నీ ఈపాటికి హరించి పోయిందనీ. ఆశ్చర్యమేమి టంటే, బంగాళీవాళ్ళన్నా, వాళ్ళ సంస్కృతి అన్నా యిప్పు డాయనకు ఏమీా మోజులేదు; సరికదా, ఒక విధమైన చిరాకుకూడాను. అది సబబుకాదనుకో. ఎంత స్వల్ప కారణాలవల్ల తెలుగువాళ్ళన్నా, ఆంధ్ర ప్రాంతపు సంస్కృతిఅన్నా, ఆయనకు మొదట్లో విముఖత కలిగిందో, యిప్పుడుకూడా, అంత స్వల్ప కారణాలకే — ప్రమాదవశాత్తు తనకు జీవితంలో సంభ వించిన సంఘటనలపై ఆధారపడి — రామేశంగారికి బంగాళీవాళ్లమీాదా, బెంగాల్ మీాదాకూడా విసుగు కలిగింది.'

శాస్త్రి, సిగరెట్టుపీల్చి, చెప్పసాగాడు: 'అందుకు మరోకారణంకూడా ఉందనుకుంటాను: ఆయనకు మొదట సంబంధం తలపెట్టిన సుభద్రమ్మగారిని మరొ కాయనకిచ్చి వివాహం అయింది. ఆయన మంచి ఉద్యోగంలోనే ఉన్నాడు. వాళ్ళ కాపురంకూడా సుఖంగానూ, సలక్షణంగానూ సాగుతూంది. సుభ ద్రమ్మకు ఆరుగురు సంతానం; నలుగురు మగపిల్లలూ, ఇద్దరు కుమార్తెలున్నూ. పెద్దవాడు మొన్ననే

డాక్టరీ పేసై, ప్రైవేటు ప్రాక్టీసు పెట్టబోతున్నాడు. వివాహంకూడా త్వరలోనే జరగబోతూంది. రెండో వాడు ఇంజినీరింగు చదువుతున్నాడు. మిగిలిన ఇద్దరూ చిన్నక్లాసుల్లో వున్నారు. పెద్దమ్మాయి అత్తవారింటికి వెళ్ళింది; బాగానే ఆర్జించుకుంటున్న వకీలుభర్తతో చక్కగా కాపురం దిద్దుకుంటూంది. రెండవ అమ్మాయి స్కూల్ ఫైనల్ చదువుతూంది. ఆరోగ్యవంతులైన బిడ్డలు; బుద్ధిమంతులూ, ప్రయోజకులున్నూ. ఈ సంగతి ఎందుకు చెబుతున్నానంటే, రామేశంగారు, తన వాళ్ళను అప్పుడప్పుడు కలుసుకుంటునట్టే, ఇప్పుడు సుభద్రమ్మావాళ్లనూ కూడా అప్పుడప్పుడు కలుసు కుంటూవుంటారు. సుభద్రమ్మ సంసారమన్నా, ముఖ్యంగా ఆమె పిల్లలన్నా, ఆయనకు చాలా సరదా. సుభద్రమ్మ యిప్పటికీ ఆప్యాయంగా 'రామేశంబావా' అనే అతన్ని పిలుస్తుంది. వాళ్లగ్రామం వచ్చినప్పుడు, రామేశంగారినీ,ఆయన కుమార్తెనూ ఆదరించి భోజనం చేస్తేనేగాని వెళ్లనివ్వదు.

చెప్పవచ్చేదేమిటంటే, ఆరుగురు బిడ్డలతల్లి అయినా ఏ నీరసమెరుగని ఆమె ఆరోగ్యమూ, దేహ పటుత్వమూ, ఏ విసుగూ చిరాకూ లేనట్లుండే ఆమె సహజ ఉల్లాసమూ, విశేషించి సుభద్రమ్మ సంసారం తీరూ, రామేశంగారి తొలి అభిప్రాయాలనూ, ఆశయాలనూ, తరువాత కాపురాన్ని అపహసించిన

ట్లుంటుంది. ఈకారణాలవల్లనే అనుకుంటాను రామేశం గారి అభిప్రాయాల్లోనూ, కొంతవరకూ నైజంలో కూడా, ఒక్కసారిగా పెద్దమార్పు వచ్చేసింది.

పూర్వపు రోజుల్లో తెలుగువారివన్నీ ఆవకాయా, పచ్చికారం, చింతపులుసూవంటి వట్టి మోటుఆహారాలని నిరసించి మానివేసి, తీపిపదార్థాలూ, టీ తరుచుగా పుచ్చుకుంటూండే రామేశంగారి కిప్పుడు దోసావకాయా, గోంగూరా, పనసకాయకూరా, పప్పులుసూ వంటి తెలుగువంటలమీదకీ, రుచులమీదికీ మనసు బాగా తిరిగిపోయింది. మరోసంగతి, అమ్మాయిని తనతల్లి పేరు పెట్టి 'సావిత్రమ్మా' అని పిలుస్తారు. అమ్మాయి సావిత్రమ్మకు, అంటే సమత్తమ్మకు, తెలుగు బాగానే వచ్చును, కాని విద్యాభ్యాసం అంతా బెంగాలీలోనే, రామేశంగారికికూడా బాగా బెంగాలీవచ్చు; కాని ఆమెతో ఎప్పుడూ తెలుగునే మాట్లాడతారిప్పుడు. అన్నిటికంటే ఆశ్చర్యమేమిటంటే ఈ సావిత్రమ్మకు ఏలాగునైనా, వీలైతే, తన పూర్వపరిచయ వర్గంలోని సాంప్రదాయమైన తెలుగు సంబంధం చేయాలని ఇప్పుడు గట్టి కోరిక.'

'ఈసంగతి నీ కెలా తెలుసు?' ప్రశ్నించాడు, రామం.

'సుభద్రమ్మ మాకు దూరపుబంధువే; కాని ఆమెభర్త నాకు దగ్గరవాడేను. అందుచేత నాకు

రామేశంగారిగురించి బాగానే తెలుసును. పాపం, చాలా తాపత్రయపడుతున్నాడు, కుమార్తె విషయమై. బాగానే చదువుకున్నదీ, నెమ్మదైనదీ, పనిపాటలూ అవీ వచ్చినదీనుట. చూశారుకదా అమ్మాయిని; అందమైనదీ. ఆకర్షణీయమైనదీ కూడాను. ఏంరా, రామం?' అని ముగించాడు శాస్త్రి.

రామం, అదోలా ముఖంపెట్టి, సిగరెట్టుముక్క పారవేస్తూ, 'టైమవుతూంది రైలుక, పోదాం పదండి' అన్నాడు, ముక్తసరిగా.

*